# ఆరుద్ర సినీ గీతాలు

## నవ్వుల నదిలో పువ్వుల పడవ



సంకలనం: కె. రామలక్ష్మి

# ఆరుద్ర సినీగీతాలు
# (1965-1970)

మూడవ సంపుటం

## నవ్వుల నదిలో పువ్వుల పడవ

సంకలనం:

కె. రామలక్ష్మి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

ARUDRA CINE GEETHALU (1965-1970) - VOL. 3
NAVVULA NADILO PUVVULA PADAVA
COMPILED BY K. RAMALAKSHMI

ప్రచురణ నెం. : 2345

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : నవంబర్, 2002



వెల: రూ. 75-00

ప్రతులు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-1.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం,
కాకినాడ.



ముద్రణ:

# ముందుమాట

తెలుగు సినిమా పాటలు – తెలుగు సాహిత్యానికి ఒక శాఖ అని అనలేము. సినిమా పాటలు – అవసరాన్ని బట్టి సన్నివేశానుగుణంగా, ఒక్కొక్కప్పుడు వరసకనుగుణంగా రచింపబడినవి. సాహిత్యశాఖగా గుర్తించకపోడానికి కారణం ఇవి ఆత్మానందం కోసమే. సాహిత్యపులోతులు తరచి విశేషాలు ఆవిష్కరించడానికి మేధను మథించి రూపొందించినవి కాకపోవడమే. ఇవి అచ్చంగా సినిమాల కోసం రాసినవి. అయితే, ఎక్కడేనా వీటిలోనూ ఎప్పుడో ఎక్కడో ఒక్కొక్కసారి సాహితీగుబాళింపు తళుక్కుమనిపించినవి లేకపోలేదు. అందుకే సినీగీతం వినాలి. చూడాలి. చదివితే కనిపించే కవిత్వం తక్కువ.

సినిమా పాట జనరంజకంగా వుండాలన్నది మొదటి లక్షణం. అందుకే మంచిదైనా, మామూలుదైనా, సినిమా పాట – అనుకోని సందర్భాలలో అక్కడక్కడ జనం నాలుకమీద ఆడుతూ వుంటుంది. సినిమా – కళ కానట్టే సినిమా పాటకూడా సాహిత్య ప్రావీణ్యం కలది కాదు. ఇది సంతోషం కల్గించడానికి, వినోదం కల్గించడానికి.

ప్రస్తుతం సినిమా పాటల సంకలనాలు చాలా వస్తున్నాయి. ఔత్సాహిక 'పాటకారులు' వీటిని చదువుతున్నారు. పాటలు నేర్చుకొని పోటీలలోను, వేదికలమీదా పాడుకొంటున్నారు.

ఎక్కడో ఒకటీ అరా తప్పించి, సినీ కవి రాసిన పాటలన్నింటినీ ఎప్పటికప్పుడు కాపీ చేసి పెట్టుకోవడం నేను ఎరగను. కాని ఈ రోజులు వేరు.

ఇండియన్ పెర్‌ఫార్మింగ్ రైట్స్ సొసైటీ (I.P.R.S) ఏర్పాటు అయ్యాక సినీకవులు గాయకులు సంగీత దర్శకులు తమ పాటల వివరాలను సేకరించుకొనే ప్రయత్నాలు ప్రారంభించారు. ఇది ఎంతో కష్టమైన పని అని ప్రారంభించేదాకా తెలియదు. I.P.R.S లో తమ తమ పాటల పూర్తి వివరాలను నమోదు చేసుకోలేని కవులూ సంగీత దర్శకులూ చాలా మంది ఉన్నారని – వారి కార్యాలయం తెలిపిన భోగట్టా.

పూర్వం సినిమా థియేటర్ల దగ్గిర పంపిణీదారులు ప్రచురించి అమ్మిన పుస్తకాల్లో కథ పాటలు ఇతర వివరాలు వుండేవి. చాలా కాలమై ఇవి కనుమరుగయ్యాయి.

ఈ పుస్తకాలు సేకరించి– వాటిని సినిమా పాటల పరిశోధనా కేంద్రాలుగా రూపొందించి కొందరు సేకరణ కర్తలు వీటి గిరాకీని గుర్తించారు. కవులకే వారి పాటలను వేలాది రూపాయిలకి అమ్ముతున్నారు. డబ్బున్న కవులు వేలు గుమ్మరించి తమ పాటలు కొనుక్కొని సంకలనాలు వేసుకుంటున్నారు. వేయించుకొంటున్నారు. అసలీ పాటలని I.P.R.Sలో ఎందుకు నమోదు చేసుకోవాలి? ఈ విషయం

చాలా మంది సామాన్యులకి తెలియదు. ఈ సంస్థ మేధా హక్కుల పరిరక్షణలో – రక్షకభటునిలా నిలుస్తుంది. ఎక్కడ ఎప్పుడు వివిధంగా ఒక సినిమాపాట వేసినా దానికై కొంత రాయల్టీ సేకరిస్తుంది. ఆ పాట వేసే థియేటర్లలో సీట్ల లెక్కనుబట్టి కొంత శాతం రాయల్టీ సేకరిస్తుంది. ఇలా సేకరించిన మొత్తాన్ని ఏడాదికి ఒకసారి ఆయా రచయితలకు పంచుతుంది. దీనివల్ల ధనలాభంమాట అటుంచితే కనీసం కవిపేరు నిలుస్తుంది. ఎవరెవరి పాటలో ఎవరెవరి పేరనో చెలామణీ అయిపోతూ వుంటాయి. రాగభావాలు తెగ వివరించి – పాటల్లో మాటలు దొర్లించి మురిసిపోయే కొందరు 'యాంకర్లు' కూడా సినిమా పేరు, పాడినవారి పేర్లూ చెప్తారుగాని కవిపేరు దాట వేస్తుంటారు. ఇలాంటప్పుడు 'ఇహం చెడ్డా ఫలం' దక్కేపని యీ I.P.R.S – కవులకి రచయితలకి చేస్తుంది.

సినిమా పాట విషయంలో ఆరుద్రది చాలా నిర్లిప్తమైన అనురాగం. నేనెప్పుడూ అతని చేతిలో పూర్తి సినిమాపాట కాగితాన్ని చూడలేదు. అతనికి పాట రచన వృత్తి; సాహిత్యం ప్రవృత్తి. ఈ ప్రవృత్తికి సినిమా పాట – బంగారు పళ్ళేనికి గోడచాపు. సినిమా పాటల రచనవల్ల వచ్చిన దానిలో చాలా మటుకు – సాహితీ సంపద సేకరించడానికే వినియోగించాడు ఆరుద్ర. ఎక్కడేనా 'మంచిపాట' రాస్తే, ఆ సంగతి నాకు తెలిసిన రచయితలు, నిర్మాతలు చెప్పేనదే. కాని తనకై తా నెప్పుడూ చెప్పలేదు. క్లబ్బుసాంగ్ నయినా, భక్తిపాటనైనా, హాస్యగీతినైనా – ఒకే అభిమానంతో రాసిన వ్యక్తి ఆరుద్ర. దేనిమీదా చిన్నచూపులేదు. 'రాయవలసివచ్చిం' దన్న బాధలేదు.

అప్పట్లో రికార్డింగు కంపెనీలు పాటలున్న రికార్డుని కాంప్లిమెంటరీగా కవికి పంపేవారు. అలా ఆరుద్ర పాటలున్న రికార్డులు చాలా చేరాయి. భాష తెలియని వాళ్ళు లేబుళ్ళు రాయడంతో ఇవి చాలా తప్పుల తడకలుగా వుండేవికూడా. రికార్డులు పాడే కండిషన్‌లో ఉంచడమన్నది చాలా కష్టమైన పని. అందుకని వాటిని పాత రికార్డులను సహితం కొత్తవాటి కంటే బాగా పాడించగల ఓర్పూ, నేర్పూ వున్న సినీ సంగీతం మీద అథారిటీ అనదగ్గ శ్రీ వి. ఎ. కె. రంగారావు గారికి ఇవ్వడం జరిగింది. నేను సినీగీతాల సంపుటాలు చేయాలనుకొని చెప్పినప్పుడు, సహాయ సహకారాలు అర్థించినప్పుడు ఆరుద్ర పాటల లిస్టు కంప్యూటర్ ప్రింట్ అవుట్ తీసి యిచ్చారు. దానివల్ల సినిమా పేరు, సంవత్సరం, సంగీత దర్శకుడు, కవి మొదలైన వివరాలన్నీ తెలుస్తాయి. ఇవి చాలా అవసరం.

ఇక పాటల సేకరణ – గడ్డివాములో సూదిని వెదకడం లాంటిదే. దీన్ని గురించి చెప్పాలి. నేనీ సంకలనాలు తీసుకురావాలని, ఆలోచన చేస్తున్నానని విని, చాలా మంది సహాయం అందించారు. ముఖ్యంగా డాక్టర్ ఎమ్. రవికుమార్ (శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ) ఆరుద్రపై సమగ్ర పరిశోధన చేసి డాక్టరేట్ పొందిన ఎల్. సంగయ్య (ఉస్మానియా యూనివర్శిటీ) ఆరుద్ర పాటలన్నిటినీ పంపించారు. రమణ అనే అభిమాని తాను ఎన్నో సంవత్సరాలుగా సేకరిస్తూ వచ్చిన ఆరుద్ర పాటల కేసెట్లు చాలా పంపించారు. వీరికి నేను కృతజ్ఞతలు చెప్పనక్కర లేదని

భావిస్తున్నాను. ఎందుకంటే, వీరు నా కుటుంబ సభ్యులు. వీరి అభిమానానికి నేను వెల కట్టలేను.

ఇక ప్రొఫెషనల్ కలక్టర్లు వున్నారు. వీరు పాటల సేకరణకి 'ఎంతిస్తారు' బేరం చేసినవాళ్ళు. ఇలాంటి వారు ఆంధ్రలో చాలా మంది వున్నారని తెలుసుకోవడం ఒక కొత్త అనుభవం నాకు. 'ఇంతివ్వండి' అని రేటు నిర్ధారించుకుని డబ్బు అందుకుని అన్ని పాటలూ పంపని వారున్నారు. 'వీటిలో గేదెవిపెట్టి' బేరం చేసిన వాళ్ళూ వున్నారు.

వారికి నిరుపయోగమే అయినా సేకరణపై డబ్బు చేసుకోవాలని తాపత్రయపడడం తప్పుకాదు వాటి 'ప్రాచీన' విలువ అలాంటిది. 'మనకి దొరకని విలువ' అలాంటిదే. కాని మాటమీద నిలబడకుండా ప్రవర్తించడమే అనైతికం అనిపించింది. అందుకే నేను వారిలాంటి వారిని ప్రాధేయపడే పని చేయదలుచుకోలేదు.

ఆరుద్ర తన సినీ రచనా వ్యవధిలో దరిదాపు నాలుగువేలకు పైగానే పాటలు రాసి వుంటాడని అంచనా. అన్నీ సేకరించ గల్గడం అసంభవం. ఉన్నవాటినే – కాలక్రమేణా విభజించి సంపుటాలుగా రూపొందించాలని నిర్ణయించుకున్నాను.

స్థానికంగా వున్నారు గనుక శ్రీ వి.ఎ.కె. రంగారావు గారు – విసుగు, విరామం, సమయాసమయం అని లేకుండా నేనడిగిన ప్రతి చిన్న అనుమానాన్ని నివృత్తి చేశారు. పి. రాజేశ్వరరావు గారు యీ సంపుటాలని విశాలాంధ్ర తరఫున ప్రకటించడానికి ముందుకు వచ్చారు. ఇది వారికి ఆరుద్రపై గల అభిమానాన్ని, గౌరవాన్ని చెప్పక చెప్తోంది.

సినిమా పాటలకు తమ తమ ప్రత్యేక ముద్ర తెచ్చిన వాళ్ళు చాలా మంది వున్నారు. అంత్యప్రాస వుండే ఆరుద్రపాట, మనసుమాటవుంటే ఆత్రేయపాట, సమాజం బాధ కన్పిస్తే అనిసెట్టిపాట, కవితా భాషాప్రయోగాలు అలవోకగా ప్రవహిస్తే అది మల్లాది వారి పాట, పురాణ పోకడలు ధ్వనిస్తే – అది సముద్రాలద్వయం (తండ్రీకొడుకులు) పాట అని చాలా మటుకు అటూ ఇటూగా గుర్తు పట్టేయవచ్చు. కాని వినే వారి అంచనాలని వమ్ము చేస్తూ వీరిలోనే అన్ని పోకడలూ పోయిన వారు వున్నారు. ఇదీ విశేషం. పాట పాత్రవల్ల, పాత్ర సినిమావల్ల జీవించడం – సహజం. కాని పాట తానేనా కూడా మనకల్గిన సందర్భాలూ లేకపోలేదు. అంటే దానిలో ఏదో సినిమా పాట పరిధిని దాటి జనాన్ని ఆకర్షించుకుంటుంది. వారి నోటపడి బ్రతుకుతోంది అనుకోవాలి.

ఆరుద్ర సినీగీతాలమీద నేనేదో తీర్పు ఇచ్చాను అనుకోవడం లేదు. నాకా అర్హతలేదు, ఆరుద్ర ఎప్పుడూ 'చాలా మంచి పాట రాశాను' అనలేదు. అనుకోలేదు. అలా అన్నదీ అనుకొన్నదీ అతని అభిమానులే. వారికే చివరికి, కవి ఋణగ్రస్తుడు.

విశాలాంధ్ర పి. రాజేశ్వరరావు గారు ఈ సంపుటాలని వెల్గులోకి తెచ్చే బాధ్యత ఆప్యాయంగా స్వీకరించారు. వారికి మాటలతో కృతజ్ఞత తెలియచేయలేను.

ఆరుద్ర సినీగీతాల సంపుటాలకి విడివిడిగా పేర్లు వుంటే బాగుంటుందని సూచించారు శ్రీ వి.ఎ.కె. రంగారావు గారు. నాకు నిజమే అనిపించింది. ఒకటి రెండు – అని వుండడంకంటే పేర్లుంటే – చదివే వారికి సౌకర్యంగా వుంటుంది. అందుకే వారినే సంపుటాలకి పేర్లు కూడా సూచించమన్నాము. ఈ పేర్లు వారు పెట్టినవే. అంతేకాదు, శ్రీ రంగారావు గారు – 'ఆరుద్ర సినిమా పాటలు – ఒక విశ్లేషణ' అనే గ్రంధ రచన చేస్తున్నారు. వీలైతే ఆ పుస్తకాన్ని కూడా ఆరుద్ర వర్ధంతి నాటికి, లేకుంటే ఆగస్టు 31 నాటికి తీసుకురావాలని ప్రయత్నిస్తున్నాను.

ఆరుద్ర మూడవ వర్ధంతి జూన్ 4 నుండి ఒక్కొక్కటిగా యీ సంపుటాలు రావాలన్నదే నా ఆశ. మిత్రులు రాజేశ్వరరావుగారు పూనుకోకపోతే ఇది సాధ్యమయ్యేది కాదు.

నేను ఒంటి చేతిమీద ఈ సంకలనాల ప్రెస్ కాపీలు సిద్ధం చేశాను. వీటిలో పొరపాట్లు వుండచ్చు. చాలా పాటలు వచ్చి ఉండకపోవచ్చు. సహృదయులైన అభిమానులు ఎత్తిచూపితే – సవరిస్తాను. ఈ సంపుటాలని ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

2002,
చెన్నై.

కె. రామలక్ష్మి

* * *

# ఇందులో...

★ ★ ★

# ఉయ్యాల-జంపాల-1965

అనుపమ పిక్చర్స్ సంగీతం: పెండ్యాల

**1**

**పాడినవారు: ఘంటసాల**

ఓ పోయే పోయే చినదాన
నీ తీయని మనసు నాదేనా
కలలో పూచిన కమ్మని ప్రేమ
కాయా పండా నెరజాణా ॥ఓ॥

ఘుమ ఘుమ పూవులు జడలోన
గుస గుసలాడె చెవిలోన
అదియేమో తెలుసుకుని
అలుగుట తగునా నాపైన ॥ఓ॥

కులుకులు తళుకులు లోలోన
జిలిబిలి సరసములాడేనా
ఒయ్యారీ సయ్యాట
ఒంటిగ ఆడుట సరియౌనా ॥ఓ॥

సొగసులు మోమున ముడుచుకొని
చురచుర చూడకె వగలాడి
ఇతగాడే జతగాడూ
ఇద్దర మొకటే ఎపుడైనా ॥ఓ॥

## 2

**పాడినవారు: పి. సుశీల**

ఉంగరాల జుట్టువాడు వూరించే కన్నులవాడు
ఒయ్యారివి నీవేనంటూ వియ్యమాడ వస్తాడూ. ॥ఉ॥

దోరవయసు చిన్నవాడు
దొర చదువులు చదివినవాడు
దోబూచులు ఆడే వలపు
దోచుకొని పోతాడు ॥ఉ॥

కొంటెతనపు కుర్రవాడు
కోరమీసమున్నవాడు
చూపులలో ఊహలు చదివి
సొగసు కానుకిస్తాడు ॥ఉ॥

కమ్మనైన వన్నెలవాడు
కలుపుగోరు మాటలవాడు
కన్నెపిల్ల మదిలో నిలచి
కాపురమే వుంటాడు. ॥ఉ॥

## 3

**పాడినవారు: మంగళంపల్లి బాలమురళీకృష్ణ.**

ఏటిలోని కెరటాలు – ఏరు విడిచిపోవు
ఎదలోపలి మమకారం ఎక్కడికీపోదు. ॥ఏ॥

ఊరు విడిచి వాడవిడిచి ఎంత దూరమేగినా
సొంతవూరు అయినవారు అంతరాన వుందురోయ్ ॥ఏ॥

తెంచుకొన్న కొలది పెరుగు తీయని అనుబంధం
గాయపడిన హృదయాలను జ్ఞాపకాలె అతుకునోయ్ ॥ఏ॥

కనులనీరు చిందితే మనసు తేలికౌనులే
తనకూ తనవారికీ ఎడబాటే లేదులే. ॥ఏ॥

## 4

### పాడినవారు: పి. సుశీల

నీలోన ఊగె నాలోన ఊగె
చూడచక్కని ఊయలొక్కటి
ఉయ్యాలా – జంపాలా – ఉయ్యాలా – జంపాలా–

ఊగి ఊగి పైకిపోయే ఊహలెన్నియో
ఆగి ఆగి భువికి దిగెను అందమెంతయో
మింటి చందమామకూ కొంటె కలువ భామకు
ముడివేసి జతకూర్చె తూగుటుయ్యెల ॥నీ॥

మనసులోని భావాలకు రూపుకల్గెను
కనులలోని కోరికలకు కాంతి పెరిగెను
బిడియపడే మనసుకు, వెలుగుచున్న కలలకు
తొలిప్రేమ తెలిపింది తూగుటుయ్యెల
ఉయ్యాలా – జంపాలా – ఉయ్యాలా – జంపాలా. ॥నీ॥

## 5

### పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

కొండగాలి తిరిగింది గుండెవ్వూసులాడింది
గోదావరి వరదలాగ కోరిక చెలరేగింది ॥కొం॥

పుట్ట మీద పాలపిట్ట పొంగిపోయి కులికింది
గట్టుమీద కన్నెలేడి గంతులేసి ఆడింది. ॥కొం॥

పట్టపగలు సిరివెన్నెల భరతనాట్యమాడింది
పట్టరాని లేత వలపు పరవశించి పాడింది ॥కొం॥

మొగలిపూల వాసనతో జగతి మురిసిపోయింది
నాగమల్లెపూలతో నల్లనిజడ నవ్వింది
పడుచుదనం అందానికి తాంబూల మిచ్చింది
ప్రాప్తమున్న తీరానికి – పడవ సాగిపోయింది. ॥కొం॥

**6**

**పాడినవారు: పి. సుశీల బృందం.**

అందాల రాముడు ఇందీవరశ్యాముడు
ఇనకులాబ్ది సోముడు ఎందువలన దేముడు ॥అం॥

తండ్రి మాటకై పదవుల త్యాగమే జేసెను
తన తమ్ముని బాగుకై తాను బాధ పొందెను ॥అం॥

అందాల రాముడు - ఇందీవరశ్యాముడు
ఇనకులాబ్ది సోముడు - అందువలన దేముడు

అనుభవించదగిన వయసు అడవిపాలు జేసెను
అడుగుపెట్టినంత మేర ఆర్యభూమి జేసెను ॥అం॥

ధర్మపత్ని చెర బాపగ దనుజుల దునుమాడెను
ధర్మము కాపాడుటకా - సతినే వీడెను
అందాల రాముడు - అందువలన దేముడు ॥అం॥

**7**

**పాడినవారు: పి. సుశీల బృందం.**

రుక్మిణమ్మా - రుక్మిణమ్మా
కృష్ణమూర్తితో నువ్వు కులికావమ్మా ॥రు॥

కన్నెపిల్ల మనసు - మీ అన్నకేమి తెలుసు
శిశుపాలుడి కన్న శ్రీకృష్ణుడు మిన్న
రమణి ప్రేమ సొంపు, నువు రాయబారమంపు
చిలకచేత కబురుపంప చెలుడు రాకపోడమ్మా. ॥రు॥

గౌరి పూజచేసి ఆ గర్భగుడిలో వేచి
ఎదురు చూడవమ్మ నీ బెదురు మానవమ్మ
రమ్యమైనవాడు ఒక రథము తెచ్చినాడు
తేరుమీద ప్రియునితోడ తేలిసాగిపోవమ్మా ॥రు॥

అట్ల తద్దెరోజు మా ఆడపిల్లల మోజు
అంతా గుమిగూడి సై ఆట పాడలాడి
తదియ చంద్రుచూసి మా తనివి తీరనోచి
అట్ల తద్దె నోము నోచ అందగాడె మొగుడమ్మా. ॥రు॥

## 8

**పాడినవారు: పి. సుశీల, ఘంటసాల**

దాచిన దాగదు వలపు - ఇక
దాగుడు మూతలు వలదు
చక్కనీ కోపమూ - చల్లనీ తాపమూ
ఎందుకు మనలో మనకు ॥దా॥

కనుచూపుల కమ్మని కులుకు
నను దోచుట మునుపే తెలుసు
మనసంతా తనదైతే మరి చోరీ ఎందుకు

పూసలలో దారమై పూవులో తావియై
కలిసెను మనసూ మనసు ॥దా॥

ఒక తీయని మైకము కలిగె
నెర వెన్నెల కన్నుల వెలిగె
కలలందు హృదయాలు వినువీధులలో ఎగిరె

ఇరువురూ ఏకమై ఒక్కటే ప్రాణమై
ముచ్చట గొలుపగ వలయు. ॥దా॥

* * *

# జమీందార్-1965

రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్ సంగీతం : టి. చలపతిరావు

పాడినవారు: పి. సుశీల, ఘంటసాల

చుక్కలు పొడిచేవేళ – అహా మక్కువ తీరేవేళ
ఆడపిల్లే పొడుపుకథ పాడవాలి
అందగాడే తెలుసుకొని విప్పాలి

కిటకిట తలుపులు కిటారి తలుపులు
వేసిన తీసిన చప్పుడు కావు
ఏమిటి? ఏమిటి?

ఓహో, కిటకిట తలుపులా కిటారి తలుపులా,
కిటకిట తలుపులు కిటారి తలుపులు
గడసరి చూపుల కన్నుల రెప్పలు కన్నుల రెప్పలు ||చు||

దిబదిబ లాడేవి రెండూ
దిబ్బెక్కి చూసేవి రెండూ
ఆలకించేవి రెండూ అందుకొనేవి రెండూ
ఏమిటి? ఏమిటి?

దిబదిబ లాడేవి రెండా, అహా దిబ్బెక్కి చూసేవి రెండా
దిబదిబలాడేవి కాళ్ళు, దిబ్బెక్కి చూసేవి కళ్ల
ఆలకించేవి చెవులు
అందుకోబోయేవి చేతులు – చేతులు – చేతులూ ||చు||

తండ్రిని చంపి తాతను గూడి
తండ్రిని కన్నది తానెవ్వరు?

తండ్రే పెరుగు - తాతే పాలు
తండ్రే పెరుగూ తాతే పాలు
తానే చిలికిన చల్లమ్మ చిలికిన చల్లమ్మా
ఆఁ
జొనమ్మా పిచ్చి పుల్లమ్మా పిచ్చిపుల్లమ్మా. ॥చు॥

పాడినవారు: పి. సుశీల, ఘంటసాల

నేనే...... ఆ.... ఆ......నేనే
నేనే నేనే లేత లేత పూలబాలను
తేనెటీగ సోకినా తాళజాలను
నేనే - నేనే పూలబాలనూ - తాళజాలను.

కానిమాటలాడకూ కలతరేపకూ కలతరేపకూ
లేని పోని చనువుతో మేని తాకకూ మేని తాకకూ

రాలుగాయి చూపులతో రవ్వ చేసినా
చిదిమినా అదిమినా జ్వాల రేగును
పూలబాలను తాళజాలను - ॥నేనే॥

పొందులేని విందుకై పొంచి చూడకూ
అందరాని దానికై ఆశలెందుకూ
మొగలి పూల పరిమళాల
సొగసులాడనీ - మొరటుగా
కోరినా మోసమౌనులే. ॥నేనే॥

* * *

# ప్రచండ భైరవి-1965

జయభేరి పిక్చర్స్ సంగీతం: పెండ్యాల

**పాడినవారు: ఎస్. జానకి**

నగుమోము ముద్దులమూట – సొగసైన వెన్నెల వేట
మనసైన కూరిమి జంట మనమేనట – ఆ౧ఆ౧ ||న||

అందాల జాబిలివి నీవు ఆకాశతారక నేను
రతిరాజు మోహము నీవు రతిరాగవల్లరి నేను
నిజమే కద ....ఆ౧ఆ౧ ||న||

గోపాల మూర్తివి నీవు కొసరేటి రాధిక నేను
గాండీవ ధారివి నీవు – కలికి సుభద్రను నేను
నిజమే కద ఆ౧ఆ౧ ||న||

గోరింక జాణవు నీవు రాచిలుక కన్నెను నేను
పులకించు నవ్వులపంట పొదరింట గువ్వలజంట
మనమేనట. ఆ౧ఆ౧. ||న||

**2**

పాడినవారు: పి. సుశీల బృందం

బావలూ బావలూ బావలు సయ్యా
జీ
అందగాడూ మగసిరి దొర
కూడవలెరా వలపుల జత
బావలుసయ్యా
మరదలు సయ్యా ॥బా॥

వేరేపూలా వాలవుగా వాలవుగా
వాలనె పిల్లా

వేరే గూడూ చేరవుగా

చేరనె పిల్లా
కూరిమితో కులుకులతో కూడితేనె జత ॥అం॥
నేనే నీవై వుందువుగా వుందువుగా

ఉందునె పిల్లా
నెనరూ వలపూ వీడవుగా వీడవుగా
వీడనె పిల్లా

నీడవలె మసలినచో – దండవేస్తా – పద ॥అం॥

★ ★ ★

# దొరికితే దొంగలు-1965

చందమామా పిక్చర్స్ సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

**1**

పాడినవారు: స్వర్ణలత, సత్యారావు

ఎన్నిసార్లు సెప్పాలయ్యా ఎన్నిసార్లు సెప్పాలి
ఎవురేనా సూసేరంటే ఏటనుకుంటారయ్యా

ఒక్కసారి చూడవెపిల్ల ఒక్కసారి చూడమ్మా
ఒక్కసారి చూశావంటే జిల్లు జిల్లయిపోతానే

తెరసాటున సిన్నది వుంటే తొంగి తొంగి సూడొచ్చా
పసుపాడే వంటరి యేళా పరపురుషుడు రావచ్చా

పండంటి మనసిచ్చానే పరాయివాడంటావా
పడిగాపులు పడుతూవుంటే సెలగాటాలాడేవా
తనవాడు తత్తరపడితే తలుపిట్లా ముయ్యొచ్చా
చినవాడి తీయని గుండె గాయాలూ చేయొచ్చా

సిలిపిగాను సూశావంటే సిగ్గేత్తున్నాదయ్యా
చినవాడా తొందరపడకు పాడికోక కట్టొస్తా
సిగ సుట్టి పువ్వులు ముడిచి సింగారం సేసుకోనీ

మురిపించే వెన్నెల వుంటే ముస్తాబులు ఎందుకమ్మా

పరేగాని ఎంతసేపు
ఒకింత ఓపిక పడితే – వూసులాడుకుందాము
ఒక్కసారి నవ్వాలమ్మా ఒక్కసారి నవ్వాలి
ఒక్కనవ్వు నవ్వావంటే – జిల్లు జిల్లయిపోతానే.

**2**

పాడినవారు: పి. సుశీల

ఎవరికి తెలియదులే యువకులసంగతి
యువకుల సంగతి మీ తల బిరుసుల సంగతి
ఆడపిల్ల కనబడితే ఏడిపించ బోతారు
నవ్వి నవ్వి చివరకు నవ్వుల పాలవుతారు ॥ఎ॥

లేనిపోని డాబులతో లెక్కలేని కోతలతో
గడుసు గడుసు మాటలతో మిడిసిపాటు చేతలతో
కాలరెత్తి తిరుగుతారు కాళ్ల బేరమాడుతారు ॥ఎ॥

ముందు తీగ లేకుంటే పందిరితో పనివుందా
తరుణసలు లేకుంటే పురుషుల పని గోవిందా. ॥ఎ॥

* * *

# ప్రతిజ్ఞా పాలన-1965

సురేష్ పిక్చర్స్ సంగీతం : మాస్టర్ వేణు

పాడినవారు: పి. సుశీల బృందం

అందాల రాజు వస్తాడు మందార మాల వేస్తాను
జగమే తథాస్తు అంటుందీ నేడే వివాహమౌతుంది.

నుదుట బాసికము – నూతన కాంతులు మెరిసే
మదిలో కోరిక మంగళ గీతము పాడే
వేచిన కనులే వేయి వలపులై పూచే
పూచిన వలపుల పులకరించునే మేను
ఓయమ్మో హోయ్ ఏమంటావ్? ॥అం॥

బుగ్గను పెట్టిన నల్లచుక్క తానవ్వే
సిగ్గుబరువుతో కన్నెవలపు తలవంచె
జడలో కుట్టిన మొగలి పువ్వు దీవించె
జన్మ జన్మకు అతడే నా మగడమ్మా. ॥అం॥

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

తలచుకుంటే మేను పులకరించేను
తమకుతామే కనులు కలలు కాంచేను

తలచుకొంటే మేను పులకరించేను
తనకు తానే చెలియ – నన్ను చేరేను.

ప్రియుని సూటిగ చూడ బిడియ మయ్యేను
చూడకుంటే మనసు ఎటుల నిలిచేను
చెలుడు గుసగుసలాడ సిగ్గు కలిగేను
సిగ్గు పడితే వలపు మొగ్గ తొడిగేను

చేయి సోకిన గుండె ఝల్లు మనియేను
ఝల్లుమని ఆపిదప చల్లనయ్యేను

చలువ వెన్నెల వేడి గాడుపయ్యేను
మరుల మాటలవల్ల మంచు కురిసేను

చెలుని మాటలలోన మధువు చిందేను
పలుకు తేనెలు గ్రోలి మైకమయ్యేను
గ్రోలి తడబడి ఎడద వూయలయ్యేను
పడతి, కాంతుని భుజము పానుపయ్యేను
తలచుకొంటే మేను పులకరించేను
తనివితీరగ ప్రేమ తానె పండేను. ॥త॥

**పాడినవారు: పి. సుశీల, లత**

రామచిలుక తెలుపవే ప్రేమ ఏమిటో
అనురాగమో సరాగమో అదేమి లోకమో. ॥రా॥

కలలోన ఒక అందగాడు నన్ను కలిసి నవ్వేనే
కన్ను కలుపగా నా వన్నెలు కదలి పొంగులాయెనే
కన్నె మనసు పొంగించిన వెన్నెల రాజెవ్వడే ॥రా॥

భామరో తనెవ్వరా? వరించు నాధుడే
ఒకచోట నిలువలేను వంటరిగా వుండలేను
ఊహాలోని చెలికాని ఊసులాడి వేగలేను
జాబిలితో ఈ తారక జతగూడుట ఎన్నడే

భామరో – నీ నోములు ఫలించునప్పుడే. ॥రా॥

**4**

**పాడినవారు: పి. సుశీల, ఘంటసాల**

ఆడపిల్ల మగవాడు కలిసినప్పుడు
అనుకొనే మాటలు రెండే రెండు
లేడి కనులు లేత మనసు కలిసినప్పుడు
పాడుకొనే పాట ఒకటే ఒకటి ||ఆ||

చందమామ చల్లగాలి నవ్వినప్పుడు
కందళించే హృదయాలు - రెండూ ఒకటె

ఎఱ్ఱ పెదవి సోగ చెక్కిలి చేరినప్పుడు
ఎద లోపలి ఆనందం ఒకటే ఒకటి ||ఆ||

కోరవయసు ఓరచూపు కులికినప్పుడు
కోరదగిన అనుభవము ఒకటే ఒకటి

పులకరించే ప్రేమ విరిసి పూచినప్పుడు
గిలిగింతలు లెక్కిస్తే అవియే కోటి. ||ఆ||

* * *

# వీరాభిమన్యు-1965

రాజ్యలక్ష్మీ ప్రొడక్షన్స్ సంగీతం : కె.వి. మహాదేవన్

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

రంభా ఊర్వశి తలదన్నే రమణీలలామ ఎవరీమె
ఇంద్రుని చంద్రుని అందాలు ఈతని సొమ్మే కాబోలు

రంభా ఊర్వశి తలదన్నే రమణీలలామ ఎవరీమె
నన్నే వెదకుచు భూమికి దిగిన కన్యక రతియే కాబోలు

ఇంద్రుని చంద్రుని అందాలు – ఈతని సొమ్మే కాబోలు
మౌనముగానే మనసుని దోచే మన్మధుడితడే కాబోలు

తనివితీరా వలచి హృదయం కానుకనీయని కరమేల
పరవశించీ పడుచువానికి వధువుగాని సొగసేల

కవికి సరసన పులకరించీ కరిగిపోవని తనువేల
ఎడములేక ఎదలు రెండూ ఏకమవనీ బ్రతుకేల. ॥ర॥

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

అదిగో నవలోకం – వెలిసే మనకోసం
అదిగో నవలోకం – వెలిసే మనకోసం
నీలి నీలి మేఘాల లీనమై
ప్రియా! నీవు నేను తొలిప్రేమకు ప్రాణమై

దూరదూర తీరాలకు సాగుదాం
సాగి దోరవయసు సీమలో ఆగుదాం

ఎచట సుఖముందో ఎచట సుధకలదో
అచటనే మనముందామా. ॥అదిగో॥

పారిజాత సుమదళాల పానుపూ
మనకు పంచినాడు చెఱకువింటి వేలుపూ
ఫలించె కోటి మురిపాలూ ముద్దులూ
మన ప్రణయానికి లేవుసుమీ హద్దులూ
ఎచట హృదయాలూ
ఎపుడు విడిపోవో
అచట మనముందాము. ॥అదిగో॥

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల.

చూచీ వలచీ, చెంతకు పిలిచీ నీ
సొగసులు లాలన చేసీ – నీ సొంపుల ఏలికనైతి

చూచీ, వలచీ చెంతకు చేరీ – నా
సొగసులు కానుక చేసి – నీ
మగసిరి బానిసనైతీ

అందాలన్నీ దోచీ, ఆనందపు టంచులు చూచీ
సందిట బందీ చేసి – నా బందీ వశమైపోతీ

నూతన వధువై నిలచీ – వరుని
వలపుల మధువుగా మారీ
సఖునీ ఒడిలో సురిగీ – కోటి
సుఖముల శిఖరమునైతి

వలపుల తేనియ మధురిమ గ్రోలితి
నిదురా జగమూ మరిచీ

నీవే జగమై నీలో సగమై
నేటికి విందుగ పండితి – ॥చూ॥

★ ★ ★

# ప్రేమించి చూడు-1965

పద్మశ్రీ పిక్చర్స్ సంగీతం : మాస్టర్ వేణు

**పాడినవారు: పి. బి. శ్రీనివాస్**

మీ అందాల చేతులు కందేను పాపం —ఎందుకు యీ బెడద
సాయం వలదా ఓ చెయ్యి వేసేదా —
చిన్నారి మేను అందాల నడుము — అల్లాడి పోవాలా
ఉయ్యాల వూచె వయ్యారి చేతులు మోటారు తోలాలా
ఇంపైన సొంపు వన్నెలు తరిగి వాడిపోవాలా
ఇటు అప్పుడేటుగా టిప్పుటాపుగా అలసిపోవాలా ॥మీ॥

కాలేజీ చదువుల తేలేవుగాని — కాసింత తగ్గాలి
వేలాది వేల రూపాయలున్నా వినయము చూపాలి
మగవాని తోడు వలదన్న వనిత మహిలోన కానరాదు
ఈ కోపమెందుకు తాపమెందుకు తగునా ఇది మీకు ॥మీ॥

కడగంటి చూపు కబురంపగానే శుభలేఖ పంపేనూ
విడిదింటి నుండి ఊరేగి నిన్నే పెళ్లాడ వస్తానూ
మనసైన వాని మామా అనగానే పొంగేనూ — యీ
మనసైన వాని మామా అనగానే పొంగేనూ —
ఇక వలపు దారిలో కలికి సేవలో
కాలము గడిపేనూ. ॥మీ॥

## 2

**పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి, ఎ. ఎమ్. రాజా**

కళకళలాడే కన్నులు – తహతహలాడే వూహలు
గుమ గుమలాడే గుండెలు – కులుకుచు వేసెను చిందులు ॥కళ॥

యాడిలీ......యాడిలీ
పెదవులే దొండ పండట హృదయమే పూల చెండట
పలుకులే పనస తొనలట – తలపులే వలపుగనులట
మేను నీకై పూలతోటై మినిటు యుగమై వేచెను
కనులు వేయి ఎదురుచూసి కాయకాచి పండెను. ॥కళ॥

యాడిలీ....యాడిలీ
దొంగవై దారి కాయకోయ్ దురుసుగా కళ్ళు మూయకోయ్
చిలిపిగా చిటికె వేయకోయ్
చెక్కిలి నొక్కి చిదమకోయ్
కొంటెపనులు చేయకుంటే – కొసరి నిన్నే చేరెద
జంటకోరి వెంటనుంటే కంటిపాపై నవ్వెద. ॥కళ॥

* * *

# పాండవ వనవాసం-1965

మాధవి ప్రొడక్షన్స్ సంగీతం: ఘంటసాల

పాడినవారు: పి. సుశీల, పద్మనాభం

బావా బావా పన్నీరు
బావకు మరదలు బంగారు
బాజాలు మోగందె బాకాలు ఊదందె
ఎందుకు కంగారు?

అయ్యో! అబ్బ, అమ్మ.
చిలిపి చేష్టలతో వలపె కోరునట
ముద్దు తీర్చమని సద్దు చేయునట
మరులుకొనే బాల తను మనసుపడేవేళ
ఉలికి పడి ఉనికి చెడి ఉక్కిరిబిక్కిరి అవుతాడంట
ఓ బావా! బావా!

మరదలా!

బావా బావా పన్నీరు బావకు మరదలు బంగారు
పరుగులుతీసే ఉరకలువేసే – బావను ఆపేరు
సుందరాంగుడంట, గ్రంధసాంగుడంట
ఏడు మల్లియల ఎత్తు తూగునంట
కలికి కొనగోట – ఆ చెంప ఇలా మీట
అబలవలె అదిరిపడి లబోదిబో అంటాడంట
ఓ బావా

మరదలా!
బావా బావా పన్నీరు
బావకు మరదలు బంగారు
వలపులలోన జలకములాడ
బావను తిప్పేరు. బావను ముంచేరు. ॥బా॥

# అంతస్థులు-1965

జగపతి పిక్చర్స్ సంగీతం : కె.వి. మహదేవన్

**పాడినవారు: పి. భానుమతి**

వినరా విస్సన్నా నే వేదం చెపుతా వినరన్నా
పేదోళ్ల నీతిలో భేదాలు లేవన్నా

ఉన్నప్పుడు హాయిగా వరిగంజి నీళ్లు
లేకుంటే చాలులే యీ పంపు నీళ్లు
సాటోళ్లతో సుకపడుట మేలు
చల్లనిచెట్టు నీడను దొరికేదే సౌఖ్యం – కొంటేను రాదులే ॥వి॥

నీరిడిసిపెడితే సేప బతికుంటదా
నీతిడిసిపెడితే మనిషి పరువుంటదా
నిజమాడితే నిష్ఠురమేగా
అయినా పేదలు కలలోకూడా – కల్లాకపటాలాడరు ॥వి॥

లోకాన తాడిసెట్టు ఎత్తయినది
ఆ సెట్టు తలదన్నేది ఒకటున్నది
అంతస్తుకి అంతెక్కడున్నది
ఏడంతస్తుల మేడకు కూడా
పునాది భూమిలో వుండాలి. ॥వి॥

## 2

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల.

పైకంతో కొనలేనిది ఏదీ లేదు
నా మైకంలో పడనివారు ఎవరూలేరు
మురిపాలు సరసాలు మురగబెట్టకు
నీ ముందు ముందు జన్మాలకు ముడుపుకట్టకు
నీ చూపులతో చిన్నదాని సిగ్గు దోచకు
దోచినచో సిగ్గుపడి మనసు దాచకు ॥పైకం॥

మైకంలో వున్నాను మన్నించాలి
నా మాటలు చేతలు మన్నించాలి
సయ్యాటకురమ్మంటే సై అన్నాను
ఒయ్యారం పలకరించ ఊఁ అన్నాను
కాదంటే కలికి బుగ్గ ఎరుపెక్కేను
ఔనంటే చిలిపి కనులు కైపెక్కేను ॥మై॥

చనువుతీసుకుంటున్నది నేనుకాదు
తనివి తీర్చమంటున్నది నేనుకాదు
మేను మరచి చూసేది నేనుగాదు
నేను గ్రోలు నిజములోని పచ్చి చేదు. ॥మై॥

* * *

# పక్కలో బల్లెం-1965

శివశక్తి మూవీస్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

**పాడినవారు: ఎస్. జానకి**

రమ్మంది లేత వలపు వినబడలేదా
లేదు పొమ్మంటే మగరాజా మరియాదేనా
పిల్లగాలి పిలవకనే నన్ను తాకునే
చల్లనైన నీటిజల్లు మేను సోకునే
చెలిమి చేయకున్నచో జీవమెందుకు
అందగాడ నేను నీకు అలుసైనానా
ఏం నలుసైనానా? ॥ర॥

వన్నెకాదు మన్నించని వయసు ఎందుకు
వలపులతో పండనట్టి బ్రతుకు ఎందుకు
కూరిమితో పలకరించు కులుకులున్నవి
తీరైన సొగసు నాకు లేదంటావా
ఏం చేదంటావా? ॥ర॥

★ ★ ★

# కీలుబొమ్మలు-1965

హైదరాబాద్ మూవీస్ సంగీతం : ఎస్.పి. కోదండపాణి

పాడినవారు: ఘంటసాల

కలిమి సుఖములు - కనరాని కటకటాలు
చెలులు భార్యా కుమారులు శృంఖలాలు
జ్ఞాని యొక్కడె వైరాగ్యమూని ముక్తు
డౌను సంసార కారాగృహము నుండి.

ఘంటసాల

రంగుల రాట్నమై అఘపరంపరలచే భ్రమించు జన్మచే
అంగన లేనిదే నరుని యాత్రకు నిండు తనమ్ములేదు ఈ
సంగర మందు ఆశ్రయ విసర్జన చేయుట పాడికాదు స
త్సంగపు కర్మయోగమే ప్రశాంతి యొసంగును రామరక్షయై

**3**

పాడినవారు: పి. సుశీల

బొట్టూ కాటుక పెట్టుకుని
పూవుల దండలు ముడుచుకొని
తూనీగల్లే ఎగిరేదానా తొందరలోనే వస్తాడు
చే – చే – చే......మొగుడొస్తాడు ॥బొ॥

చీటికి మాటికి చెలరేగే – నీ
నోటికి తాళం వేస్తాడు
వెక్కిరించు నీ వెటకారాలకు
టక్కున కళ్లెం వేస్తాడు. ॥బొ॥

మిడిసి పాటు యింకెన్నాళ్లులే – నీ
మెడలు వంచి ముడివేస్తాడే
చెప్పిన మాటలు వినకుంటే – నీ
చెవులు పట్టి ఆడిస్తాడు. ॥బొ॥

సిగ్గులతో తల వంచుకొనే
నీ బుగ్గమీద చిటికేస్తాడు
జరిగేకొలదీ ఎడమైతే – నీ
జడతో భరతం పడతాడు. ॥బొ॥

★ ★. ★

# భక్త పోతన-1966

భారత్ ఫిలిమ్స్ సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

**పాడినవారు: పి. సుశీల**

శ్రావణ మేఘాలు కూరిమి భావాలు
జడిగా వడిగా కురిసే అందాలు
మేఘములో మెరుపువలె నా మనసే తోచె
మేలుకునే నెమిలివలె నా మనసే ఆడె
మహాకవి మనోరథం ప్రసూనమై ఫలించెలె ॥శ్రా॥

కార్తీక దీపమై కనుపాప అవులించె
గరిపొడిచే మేనుపైన నునుసిగ్గే జేవురించె
జవరాలి సోయగాలు జలతారు వన్నెలాయె
నెరజాణ ఆశలన్ని మురిపాల ఏరులాయె. ॥శ్రా॥

| 2 |

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

నగరాజ కన్య – జగదేక మాన్య
కమనీయ దివ్య కళ్యాణ ధన్య
సెలయేట ఆడి చిరుబంతి పసుపు
చెలువార కదిలె హరిసేవ కొరకు

మరుని గెలిచే బిరుదు
మరులు కొలుపు తీయని సొరు
తగును నీకే జాణ – దేవరా

ఆడినది నడు మాడినది
మది పాడేను మంజుల గీతికలు
చెఱకువంటి దొర విరులకత్తిదొర
దూసిన కటారి సొగసుల మిటారి

తరుణి తనువిదే
మరుని ధనువుగా
తనివితీర తా మారినది
స్వామిసేవ సగమైనా వలపుల
సర్వమంగళ – పండినది.

★ ★ ★

# శ్రీమతి-1966

శ్రీనిలయం పిక్చర్స్ సంగీతం : నిత్యానంద్

పాడినవారు: పి. సుశీల, ఘంటసాల

మ్రోగింది గుడిలోని గంట
మురిసింది హృదయాల జంట
నీలో నాలో వెలిగే ప్రేమ
నింపింది కిరణాల పంట
నా మనసే ప్రియా, నీ వుండే విడిది
నాలో పొంగింది ఆనంద జలధి

వికసించె మనోభావాలు కలిసె
పెండ్లిపందిరిగా లోకమె వెలిసె
నీవే నేనుగ ఒకటైనచోట
పూచే వలపులతోట ॥మ్రో॥

ప్రేమించు నిన్ను సేవించుదాన
ఇల్లాలినైనాను యీ ముహూర్తాన
దేవతలే చెలీ దీవించారు
ఇద్దరినొకటిగా కావించారు
ఎప్పుడు మనలో ఎడబాటులేక
బ్రతుకే పువ్వుల బాట. ॥మ్రో॥

## 2

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

కోరికలా కుటీరంలో
చేరియుందము ప్రియా
మరుమల్లె నీడా అందాల మేడ
వెలిసింది మనకోసమే కాదా

వేయి కనుల నీ కొరకే
వేచి యుంటాను ఈ రోజు
నీలినీలి మేఘములా
తేలి వస్తాను - నీకై
కాపురాన తేనెలూరే ప్రేమనిండేను
నిండి, నోము పండేను. ||కోరి||

చందమామ మనకు వేసె చలువ పందరి
అందు సాటిలేని తనివి తీరు ప్రణయసుందరీ
మరపురాని మరువలేని
మమతల్లో డోలలూగు
ఊహ నేడు ఊయలాయె
హృదయమూపగ నీవు
నిదురపోవు మీ మదిలో
జో.....జో...

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

ఈ రోజు మళ్లీరాదు
ఈ హాయి సాటిలేదు
జల్సాలు పాపం కావు సుఖించవయ్యా
మగవాడె కమ్మని తుమ్మెదరేడు
మగువేమొ వన్నెలువాడని పూవు
మనసైన భోగమే పూచిన తోటోయ్
వాలాలి నీవు సోలాలి నేను మైకాన తేలాలిలే ||ఈ||

ఇంపైన వంపుల సొంపులు చూడు
ఎన్నెన్నో ఊహల మోహము చూడు
ఈనాడె స్నేహపు దాహము తీరు
వూరించే నీవు ఉసికొలిపే నేను - ఉర్రూతలూగాలిలే. ||ఈ||

# కన్నెమనసులు-1966

బాబూ మూవీస్. సంగీతం : కె.వి. మహదేవన్

పాడినవారు: పి. సుశీల

ఓహో తమరేనా చూడవచ్చారు చూసి ఏంచేస్తారు
ఓ మామ ఓ మామ ఓ మామ అయ్యోరామ ॥ఓ॥

సంతలోని జంతువును కాదుసుమీ
వంటయింటి కుందేలును అవనుసుమీ
ఎవరేమిటన్నా మగాళ్లకన్నా, మావాళ్లే మిన్న మీ డాబులు సున్న
వెళ్లండి వెళ్లండి – మీదారి మళ్లండి
దూ దూ బసవన్నా ఓ మామ! అయ్యోరామ ॥ఓ॥

అలుగుట తగదురా పెళ్లికుమారా
హాస్యము లాడితిరా వలపుల చోరా
చెమటలు పోసినవా చెంగున వీతునురా
చెలరేగి నీ భరతం పట్టిస్తారా ఓ మామ అయ్యోరామ ॥ఓ॥

మూడునాళ్ల ముచ్చటకే మురిసినచో
ఆడపిల్ల బ్రతుకంతా హారోంహర
పెళ్లాడురోజు వుంటుంది మోజు – ఆపైన క్లోజు – పడుతుంది బూజు
ఆనాడు ఈనాడు ఏనాడు మగవాడు – ఇంతే రివాజు
ఓ మామ – అయ్యోరామ. ॥ఓ॥

★ ★ ★

# భీమాంజనేయ యుద్ధం-1966

మహాలక్ష్మి మూవీస్ సంగీతం : టి. వి. రాజు

పాడినవారు: పి. సుశీల, ఎల్. ఆర్. ఈశ్వరి

నేనె నేనె నేనె మధుగీతి
నవరస పూరిత విలాసవతి
మదిలో పొంగే మాధురి నేనే
సుధలో కలిగే సుఖమును నేనే
కలువలరాయుని వెలుగులు నేనే
కలలో దొరికే ఫలమును నేనే ॥నే॥

చవులూరించే చెలువము నాదే
నవలోకముల నవ్వులు నావే
పరవశమొందే పరువము నాదే
వలపూ గెలుపూ సకలము నేనే. ॥నే॥

* * *

# భూలోకంలో యమలోకం-1966

గౌరీ ప్రొడక్షన్స్ సంగీతం : ఎస్.పి. కోదండపాణి

**1**

**పాడినవారు: ఎస్. జానకి**

ఓ యమధర్మరాజ మహితోజ్వలతేజ పరేతరాట్ ప్రభూ
ఈ యభియోగసారమున నించుకయైన నిజమ్ము లేదు - నే
పాయని భక్తితో విభుని పాదములెంచు - సుశీలనయ్య - అ
న్యాయపు నిందలేల చెదలంటునె అగ్నికి కోణవాహన

**2**

**పాడినవారు: ఎ. వి. సుబ్బారావు**

ఇంటిగుట్టు దాచ నింతింత యనరాని
పాపకర్మలందు ఒరిగినావు
అన్నె మెరుగనట్టి యల్లుని వంచించి
కానిదాని కంటకట్టినావు.

**3**

**పాడినవారు: ఎ. వి. సుబ్బారావు**

అక్క పసుపున యొక తోక చుక్కవోలె
పొడమె నీతడు చెరబట్టి పుణ్య సతుల
చెరప జూసెను కడు దుష్టశీలుడితడు
ధూమ కేతుడు - సార్థక నాముడయ్యె.

4

పాడినవారు: ఎ. వి. సుబ్బారావు

గారాల బిడ్డ కోసము
ఏరాలి కుమార్తె బ్రతుకు ఏటనుగలిపె
ఈరాకాపి యొనర్చిన
నేరాలకు లెక్కలేదు నిజము మహాత్మా.

పాడినవారు: ఎ. వి. సుబ్బారావు

పచ్చికామి ముందు పరవళ్లు తొక్కుచు
బావ పొందుగోరి దేవులాడె
ముసుగులోన దూరి ముచ్చటలాడంగ
సాహసించినట్టి ద్రోహియాయె.

★ ★ ★

# శకుంతల-1966

రాజ్యం పిక్చర్స్ సంగీతం : ఘంటసాల

పాడినవారు: పి. సుశీల బృందం

మధుర మధుర సుమసీమ
సుధలు కురియు వనసీమ
ఏవేవో భావాలు పూవుల
వోలె పూచే సీమ ॥మ॥

తేటికి ఆట నెమలికి ఆట
తెలిపే అందాలు
ఉసిగొలిపే చందాలు
హంసకు నడక లేడికి పరుగు
నేర్పే పరువాలు
హోయ్ హోయ్ – నా నిగనిగ చెలువాలు
కన్నియ చిరునవ్వు కమ్మని నునుసిగ్గూ
ఎన్నటికైనా వాడని సీమ ॥మ॥

చల్లనిమాసం పెళ్లిముహూర్తం
మల్లిక వధువుసుమీ
ఎల మావే వరుడు సుమీ
మంజులగానం మంగళగీతం
మన్మధ వేషాలు
తొలి వలపుల మంత్రాలు
పువ్వులకళ్యాణం – నవ్వులవైభోగం
ముచ్చటలన్నీ తీరె సుమా. ॥మ॥

★ ★ ★

# లేతమనసులు-1966

ఎ.వి.ఎమ్. ప్రొడక్షన్స్ సంగీతం : ఎం.ఎస్. విశ్వనాథన్

పాడినవారు: పి. సుశీల

పిల్లలూ దేవుడు చల్లనివారే
కల్లకపట మెరుగనీ కరుణామయులే
తప్పులు మన్నించుటే దేవుని సుగుణం – ఇది
గొప్పవాళ్లు చెప్పినట్టి – చక్కని జ్ఞానం ॥పి॥

పుట్టినపుడు మనిషి మనసు తెరచియుండును
ఆ పురిటికందు మనసులోన దైవముండును
వయసు పెరిగి మదము కలిగి యాసుపొచ్చితే – అంత
మనసులోని దేవుడే మాయమగునులే ॥పి॥

పెరుగుచున్న సూర్యుణ్ణి మబ్బుమూయును
మనిషి తెలివియనే సూర్యుణ్ణి కోపం మూయును
గాలి వీచి మబ్బుతెరలు కదలిపోవులే – మాట
కలుపుకొన్న కోపమే చెలిమి యగునులే ॥పి॥

పెరిగి పెరిగి పిల్లలే పెద్దలౌదురు – ఆ
పెద్దలేమొ కలహిస్తే చిన్నబోదురు
మాయమర్మమేమిలేని బాలలందరు
ఈ భూమిపైన వెలసినట్టి పుణ్యమూర్తులే. ॥పి॥

## 2

పాడినవారు: పి. సుశీల

కోడి ఒక కోనలో – పుంజు ఒక కోనలో
పిల్లలేమో తల్లడిల్లె – ప్రేమలేని కానలో
పాలకొరకు లేగదూడ పరుగులెత్తిసాగును
పక్షికూడ కూడుతెచ్చి పంచిపెట్టి మురియును
తాతా! తెలుసునా జాలీ కలుగునా
విడి విడిగా జీవించే వేదనలే తీరునా
వేదనలే తీరునా. ॥కో॥

పొరుగువాళ్ల పాపలాగ పెట్టిపుట్టలేదులే
అమ్మతో నాన్నతో హాయినోచుకోములే
అమ్మ మరవదు – నాన్నా తలవదు
కన్నవాళ్ల కలుపుటకు – మాకు వయసు లేదులే
మాకు వయసు లేదులే. ॥కో॥

* * *

# గూఢచారి 116-1966

జయలక్ష్మీ పిక్చర్స్ సంగీతం : టి. చలపతిరావు

పాడినవారు: ఘంటసాల

ఓ వాలుచూపుల వన్నెలాడీ
నిన్ను చూస్తేనే చాలు ఒక్కసారి
డీరి డిరి డిరి....

చెంపమీద చిటికేస్తే
సొంపులన్నీ పోగేస్తే
ఊహలెన్నో వూరిస్తే
కోరివస్తే హాయ్ - హాయ్ - హాయ్

అందమైనదానివి - ఆశపెట్టేదానివి
పాడుసిగ్గా దేనికి - వలచివస్తే హాయ్.
చిలిపిచూపుల కన్నులు - మొలకనవ్వుల పెదవులు
పలకరించే వన్నెలు పులకరిస్తే హాయ్ - హాయ్

నిన్న సంగతి మరిచిపో - నేటి సుఖమే తలచుకో
రేపు వుండే దెక్కడో - ఇపుడు మాత్రం - హాయ్ - హాయ్

## 2

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల బృందం

యా - యా - యా
మనసుతీరా - నవ్వులె నవ్వులె నవ్వాలి
మనము రోజూ పండుగె పండుగె చేయాలి.

చేయి కలుపు - సిగ్గు పడకు
అందుకో వోయ్ నా పిలుపు

అవును నేడే - ఆటవిడుపు
ఆటల పాటల కలగలుపు

పువ్వులాగా పులకరించు
దాచకోయీ కోరికలూ

ఆశలుంటే అనుభవించు
అనుభవాలే సంపదలు.

## 3

పాడినవారు: పి. సుశీల

పడిలేచే కెరటం చూడు
పడుచుపిల్ల బింకం చూడు
తొంగిచూచు సిగ్గులు చూడు
పొంగుతున్న అందం చూడు ॥ప॥

వెన్నెల విరిసేవేళ - వన్నెలు మెరిసేవేళ
చందమామ పరుగులు చూడు
చల్లగాలి ఆరడి చూడు
మిసమిసలా చిన్నెలు చూడు
ఉసికొలిపే హృదయం చూడు

పరులెవరూ లేనిచోట పరువాలు పూచేచోట
కరుగుతున్న కాలం చూడు
పెరుగుతున్న ఆశలు చూడు
మరుగులేని మమతలు చూడు
మనసుంటే నన్నే చూడు. ॥ప॥

**4**

పాడినవారు: పి. సుశీల

అవును – నేనే – నీకోసమే.
ఎందుకో చెప్పనా – రా అబ్బ
నీతో – నిజంగా – నిజంగా
నీతో ఏదో పనివుంది – నీకే – నీకే అది బోధపడుతుంది

తొలినాడు కాదు పొమ్మన్నా
మరునాడు పారిపోయినా..... ఆ తరువాత

నా చెవిలో నీ మనసు గుసగుసలాడింది
ఈ మదిలో కోరికలు తహతహలాడినవి
అందుకనే – నీతోడు – ఊసుపోదు
నిదురరాదు – నిలువలేను – నన్ను నమ్మవూ నిజంగా ॥నీ॥

ఆవేశం నన్ను నడిపించింది
అవకాశం నిన్ను చూపించింది
అందుకే – ఈ రాత్రికే –
ఏవేవో తావులకు దారులు తీస్తాను
కలలన్నీ పండించే కానుక యిస్తాను
ఊఁ యిదుగో –
తెలియనిమైకంలో తేలిపో
నిజంగా..... నీతో ఏదో పనివుంది అది
నీకే – నీకే బోధపడుతుంది. ॥నీ॥

★ ★ ★

# పొట్టిప్లీడరు-1966

రేఖ అండ్ మురళి ఆర్ట్స్)                    సంగీతం : ఎస్. పి. కోదండపాణి

**1**

పాడినవారు: పిఠాపురం, జానకి, మాధవపెద్ది

అందం అన్నది నీలో చూడాలి
ఆశలన్నీ నీతో తీరాలి
నడక సొంపు ఒడలి ఒంపు
కనులకింపు చెయ్యాలి.
అల్లీ బిల్లీ జోకరూ – ఆరిన్ రాణీ నౌఖరు
కరుణ చూడూ బరాబర్.....

ఓరి దుర్మతి తప్పదియ్యా
కారుకూతలు కూతువా..?
రూకచేయని కాకిపిల్లవా
జాకిపుత్రిక భర్తవా?
సంచులున్నా సాటివానికి
చంచలాక్షిని యిత్తురా
అంచితముగా ధనము తేరా
అప్పుడే నిను మెత్తురా

పిచ్చిజాకీ బంధుత్వమొక బాకీ – విను నా టాకీ
డబ్బేమి శాశ్వతమో మామా
తబ్బిబ్బు పడకోయి శ్రీమామా
పోయేటి రోజునా నీతోటి రాదులే
పుణ్యాలు చెయ్యవోయ్ పాపాత్ముడా
నా కాళ్లు కడగవోయ్ ఓ మామా
నీ కన్య నీయవోయ్ మేనమామా

ఓరీ జోకరా నాకే ఇత్తువా టోకరా
జనకా. జనకా
అదంతా ఆనక, ఉండా వెనక! నువ్వు ఫో, నువ్వు రా.
మామా - జాకీ
నిటలాక్షుండిపుడెత్తి వచ్చినను రానీ, తిట్టనీ కొట్టనీ
అటు సూర్యుండిటు దుంపతెంపి పడనీ ఆటంబులే పేలనీ
విటుమిన్నేన్యమ్ముగను కూడబెట్టెదనులే వెయ్యేళ్లు కానిమ్ము ఊ నే
నటులే సేయనినాడు పాడుభువిలో నా పేరు శ్రీ జోకరే
నువ్వే నా నవ్వుల పువ్వులరాణీ
నువ్వే నా జిలిబిలి వలపుల రాజా
కోరిక తీరే కులుకులు దొరికే ఊహలు ఊయెలలూగే

దగ్గర కొస్తే బుగ్గమీద సిగ్గులు ముగ్గులు వేసే
నీ చేయితాకిన చాలు నా గాలిసోకిన చాలు
నిదురించు మోహాలేమో చెలరేగెను
నీ రూపుకంటే చాలు నీ మాటవింటే చాలు
నాలోని అందాలన్నీ పులకించును
గుండెలోనా గుసగుసలాడే - ఆశలు హాస్యాలాడే
పండిన ప్రేమ - పకపక నవ్వే - పరువము పండుగ చేసే

★ ★ ★

# ఇద్దరు మొనగాళ్లు-1966

మధు పిక్చర్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: మాధవపెద్ది, ఎస్. జానకి

ఓం యం – యం
యక్షరూపం – దశదిశ విదితం
భూమికంపాయమానం – పం – పం
పాప నాశం ప్రణమిత సతతం
భైరవం క్షేత్రపాలం.

ప్రభో కాలభైరవ దేవరా
మంత్రకై వర మీయరా
నాగహార రాగదూరా
రౌద్రీ భీకర శేఖరా

రక్తపింగళ నేత్రయుగళా
భక్తకోటి వశంవదా
శక్తులొసగి యుక్తులొసగి
సర్వదా నను కావరా

ధృత ధృత ధృవితం
జ్వాలితం కామదాహం
ధూమవర్ణా తామ్రలోచన దురితజాల విమోచనా
కరాళదంష్ట్ర భీషణా కామితార్థ సాధనా
ఓం – భూతనాథం – ప్రణమిత సతతం
భైరవం క్షేత్రపాలం.



పాడినవారు: జేసుదాసు, ఎస్. జానకి

కొంగున కట్టేసుకోనా
ఓ రాజా రాజా రాజా
గుండెల్లో దాచేసుకోనా
నిను గుండెల్లో దాచేసుకోనా

జడతోనె కట్టేసుకోవే
ఓ రాణీ – రాణీ – రాణీ
వడిలోన లాలించుకోవే
నను వడిలోన లాలించుకోవే

పిలిచే కమలము నేనే
వలచిన తుమ్మెద నీవే
నే జుమ్మని వాలుతాను
కడు కమ్మగా నవ్వుతాను
పరవశమయ్యేది మనమే ॥కొంగున॥

తీయని పండువు నీవే
వాలే చిలుకను నేనే
నను కొసరుచు ఊరించేవు
నవరసముల లాలించేవు
తరితీపుల సోలేది మనమే. ॥కొంగున॥

* * *

# శ్రీకృష్ణతులాభారం-1966

సురేష్ ప్రొడక్షన్స్ సంగీతం : పెండ్యాల

పాడినవారు: పి. సుశీల, ఎల్. ఆర్. ఈశ్వరి

ఇది సరాగాలతోట – సుమపరాగాల బాట
ఇట తమితీరుతుందట – టట టట టా

చిగురించే చిలిపితనమట
చిటికేసే పడుచుదనమట
చెలరేగే మురిపాలందు
కలబోసిన కమ్మదనమట ॥ఇ॥

ప్రతికొమ్మా కులుకుతుందట
ప్రతిరెమ్మా నవ్వుతుందట
ప్రతిపువ్వూ పుప్పొడి జల్లీ
జతగానితో కలుపుతుందట ॥ఇ॥

కెరటాల కేరింతలటా
జలకాల పులకింతలటా
ఒకసారీ ఓలలాడితే
కలకాలం పరవశమ్మట. ॥ఇ॥

★ ★ ★

# ఆత్మగౌరవం-1966

అన్నపూర్ణ పిక్చర్స్ సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

పాడినవారు: ఘంటసాల

ఓ సోదర సోదరీమణులారా
ఆదరించి నా మాట వింటారా

ప్రేమించి పెళ్లిచేసుకో –
నీ మనసంతా హాయి నింపుకో ॥ప్రే॥

వరుని వలపేమిటో వధువు తలపేమిటో
తెలుసుకోలేక పెళ్లిళ్లు జరిపించినా
కలిసి కట్నాలకై బ్రతుకు బలిచేసినా
కడకు మిగిలేది ఎడమోము పెడమోములే ॥ప్రే॥

మనసు తెలియాలిలే – మనసు కలవాలిలే
మరచిపోలేని స్నేహాన కరగాలిలే
మధుర ప్రణయాలు మనువుగా మారాలిలే
మారి నూరేళ్ల పంటగా వెలగాలిలే ॥ప్రే॥

నలుదు ప్రేమించి పెళ్లాడె దమయంతిని
వలచి రుక్మిణియె పిలిపించె శ్రీకృష్ణుని
తొలుత మనసిచ్చి మనువాడె దుష్యంతుడు
పాత వరవళ్లు దిద్దాలి మీరందరూ. ॥ప్రే॥

## 2

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

ప్రేమించనిదే పెళ్లాడననీ
తెగ కోతలు కోశావులే
ఆ మాటలు ఏమైనవి
అహఁ అయ్యగారు ఓడారులే.

పెళ్లాడనిదే ప్రేమించననీ
తెగలెక్చర్లు దంచావులే
మాటకు యీ చేతకు
అహఁ అంతు పొంతు లేదాయెలే ॥ప్రే॥

నీ వలపు తెలుపక ఊ అంటివి
నా తలపు తెలియక ఔనంటిని
నీ ఆశయం ఏమైనది
అహఁ నీటిమూట అయిపోయెలే ॥ప్రే॥

శ్రీరంగ నీతులు చెప్పావులే
చిత్రంగా ప్లేటును తిప్పావులే
అమ్మాయిలు ఎటు బొంకినా
అహఁ అందమెంతో చిందేనులే ॥పెళ్లా॥

ఈ సొగసు నవ్వించి కవ్వించులే
నా వయసు నిన్నే బంధించులే
కనుపాపలో నిను దాచితి
నను విడిపోవులే – అహ
నను విడిపోవులే ॥ప్రే॥

పైపైన మెరుగులు కొన్నాళ్లులే
మదిలోన మమతలు పూయాలిలే
ఒయ్యారమే ఒలికించినా–
అయ్యగారు చలియించరు – అహ
అయ్యగారు చలియించరు

ప్రేమించనిదే పెళ్లాడనని
తెగ కోతలు కోశారులే
నా మాటకు నీ చేతకు అహ
అంతు పొంతు లేదాయెలే. ||ప్రే||

**3**

పాడినవారు: ఘంటసాల

రానని రాలేనని ఊరకె అంటావు
రావాలనే ఆశ లేనిదే ఎందుకు వస్తావు
కొంటెచూపు చూడకు, గుండెకోత కోయకు
కోపమందు కులుకుచూపి కోర్కె పెంచకు
వేషమైనా మోసమైనా అంతా నీకోసం. ||రా||

ఎదను గాయమున్నది ఊరడించమన్నది
మొదట ముద్దుతీర్చమని మూల్గుచున్నది
గుండెమీద వాలిచూడు గోడువింటావు ||రా||

దోరవయసు వేడిలో కోరచూపు వాడిలో
భారమైన మనసు పడే బాధ అయ్యయ్యో
కరుణ చూపి కరుగకున్న టాటా చీరియో. ||రా||

★ ★ ★

# పల్నాటియుద్ధం-1966

శ్రీ అనురూపా ఫిలిమ్స్ సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

**1**

పాడినవారు: పి. బి. శ్రీనివాస్, ఎస్ జానకి

తీయని తొలిరేయి – ఇది తిరిగిరాని రేయి
వేయి వేయి జన్మలకు వెలిగే తొలిరేయి

లేత లేత మురిపాలే పూలపాన్పు పరిచేను
కానరాని బిడియాలే కొంగులాగి నిలిపేను
రాగమాలిక పూలడోలిక ఊహలన్నీ ఊగెనె ॥తీ॥

తెలియరాని కురులందు తేలి మనసు కులికెను
కలలు కన్న సరసాలు కనులముందు నిలిచెను
ప్రియుని కౌగిలి విరుల పందిరి
కన్నెవలపులె – పూచేను ..... ॥తీ॥

నింగినుండి నెలరాజు తొంగి తొంగి చూసేను
నీటుగాడు రతిరాజు పూలకోల వేసేను
చిలిపి జాబిలి చిలుక సాహిణి
మనలకలిపి – నవ్వేను. ॥తీ॥

★ ★ ★

# అదుగుజాడలు-1966

నవజ్యోతి ఫిలిమ్స్ సంగీతం : మాస్టర్ వేణు

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల బృందం

సిన్నోడ బుల్లెమ్మ – సిలకల్లె వుంది.
సెటాపటా లేసుకొని – సిందులెయ్యి
సొంపుగా ఆడితే ఇంపుగా పండుగ ॥సి॥

చెంచీత ఆగవే చిన్నారి చిలక
నీమీద మనసాయె విరజాజి మొలక
పోవోయి పోవోయి పొగరుమోతా – నీకు
పొద్దేల పోదోయి – పోకిరోడా

మచ్చావతారుడై చెంచుభామా
నేను మరులు కొనివచ్చానె చెంచుభామా
మచ్చమైతె మెచ్చనయ్య కిట్టమూరితి
నువ్వు మడుగులోనె వుండవయ్య కిట్టమూరితి

కూర్మావతారుడనె చెంచుభామా – నీ
కులుకు చూసి వచ్చానె చెంచు భామా
తాబేలువైతేను కిట్టమూరితీ –నీకు
తరుణి పొందు ఎందుకోయి కిట్టమూరితి
అహఁ కిట్టమూరితి. ॥సి॥

వరహావతారుడనె చెంచుభామా
వగలు చూసి వచ్చానె చెంచుభామా
అడవి పందైతేను కిట్టమూరితి మా
అన్నలు వేటాడేరు కిట్టమూరితి

ఓహో కిట్టమూరితి

నరసింహస్వామినే చెంచుభామా – నా
మురిపాలు తీర్చవే చెంచుభామా

సగం సగం మనిషివైతె కిట్టమూరితీ – నీ
మొగము చూడలేమోయి కిట్టమురితి
సిన్నోడ! బుల్లెమ్మ!
వామనావతారుడనె చెంచుభామా – నన్ను
వలదంటె వూరుకోనె చెంచుభామా
మరుగుజ్జు కుర్రోడివి కిట్టమూరితీ – నా
నడుముదాక రావు నీవు కిట్టమూరితీ
నా నడుముదాక రావు నీవు కిట్టమూరితీ

పరశురామమూర్తినే చెంచుభామా
అయ్యో పట్టరాని మోహమాయె చెంచుభామా
తల్లినే నరికావు కిట్టమూరితీ
నువ్వు పెళ్లాన్ని చంపవా కిట్టమూరితీ

రామావతారుడనె చెంచుభామా
ప్రేమ నువ్వు కాదనకె చెంచుభామా
అలిమీద జాలిలేదు కిట్టమూరితీ – నేను
అగ్గిలోకి దూకలేను – కిట్టమూరితీ
బాధించకే నన్ను చెంచుభామా – నీకు
బానిస నౌతానే చెంచుభామా
ఆదివిష్ణువే నువ్వు కిట్టమూరితీ – నీకు
అలినౌట అదృష్టం కిట్టమూరితి.

* * *

# ప్రయివేటు మాస్టారు-1967

డి. బి. ఎన్. ఫిలిమ్స్ సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రమణ్యం

పాడుకో పాడుకో పాడుతూ చుదువుకో
పాడుతూ చదువుకో ||పా||

ఆదిలో మన విద్య లయబద్ధమే
వేదాలు నాలుగూ సంగీతమే
పారాలు పాటగా వల్లించితే
వినోదం వికాసం విరజల్లులే ||పా||

రాలైన కరిగించు గాంధర్వమూ
రమణీయమూ అది కమనీయమూ
సంగీతమేదైన సాధించునూ
స్వరాల ప్రభావం అమోఘం సుమా! ||పా||

* * *

# పిన్ని-1966

శ్రీకాంత్ ప్రొడక్షన్స్ సంగీతం : టి. వి. రాజు

**1**

**పాడినవారు: పి. సుశీల**

ఆడజన్మకు కంటినిండ నిదుర రెండుసార్లేనమ్మా రెండేసార్లు
అన్నెమెరుగని బాలప్రాయమున తొలిసారి
అన్నీముగిసిన అవసానకాలాన కడసారి

బంగారు ప్రాయమిది పవళించవె తల్లీ
ఈ వయసు దాటితే - నిదురేది మళ్లీ
బంగారు ప్రాయమిది పవళించవె తల్లీ
జోజో జోజో పాపాయీ. ॥బంగారు॥

అయిదేళ్ల వయసులో ఆడుకోవాలి
బడిలోన తెలుగు - పాట పాడుకోవాలి
పదేళ్లు రాగానే - పారాల బరువు ॥బంగారు॥

ఈడురాగానే - జోడుకావాలి
కనుతెరచి కమ్మగా కలలు కాంచాలి
కోరి వలచినవాడు చేరబోయినచో
తండ్రి కాదంటె తనకు నిదురేది ॥బంగారు॥

చల్లగా వడినిండె తల్లివైనపుడు
నిదురన్నమాటే నిను చేరరాదు
అలసిన నీ బ్రతుకు ఆవలించగనే
కనరాని నిదురే కనికరించేను. ॥బంగారు॥

**2**

**పాడినవారు: పి. సుశీల**

ఏడవకు ఏడవకు వెర్రినాతల్లీ
ఏడిస్తె నిన్నెవ్వరెత్తుకుంటారు ॥ఏ॥

వేళగానివేళ వియ్యాలవారు
అందాలతల్లిని అడగవచ్చారు
తాళజాలనివారు తరలివచ్చారు
ఆగమంటే వారు రేగిపోయేరు ॥ఏ॥

సమయమెరుగని వారు సన్నచేశారు
తనగొడవ తప్పించి పట్టించుకోరు
కారాలు మిరియాలు నూరిపోస్తారు
కోరమీసం దువ్వి కోపించుతారు. ॥ఏ॥

చక్కని నా తల్లి గుక్కపెట్టింది
చెక్కుటద్దాలలో చెదిరినె సంజ
మిద్దెపై మహరాజు గద్దించకయ్య
ముద్దుల్లపాపాయి నిద్దరోలేదు: ॥ఏ॥

## 3

పాడినవారు: పి. బి. శ్రీనివాస్, ఎల్. ఆర్. ఈశ్వరి

కలవాలి – నిన్ను కలవాలి
కలిగిన వలపులు తెలపాలి
కలకాలం మన అనురాగం
వలపుల వెలుగులు వెలగాలి ॥కల॥

యవ్వన వనమున కలవాలి
గువ్వల జంటై కులకాలి – మన
కోరికలన్నీ తీరాలి ॥కల॥

దాచిన వలపులు తెలుపాలి దోచిన మనసులు ఇవ్వాలి
పూచిన సొగసులు నవ్వాలి బూచులు ఆడుచు తిరగాలి ॥కల॥

తళ తళ వలపే పండాలి తనువులు ఏకం కావాలి
తెలియని పరవశమొందాలి విరితేనెలు మదిలో నిండాలి. ॥కల॥

* * *

# కంచుకోట-1967

విశ్వశాంతి పిక్చర్స్ సంగీతం : కె. వి మహదేవన్

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

ఈడొచ్చిన పిల్లనోయ్ – హోయ్ హోయ్
నిన్ను ఆడించే పిల్లనోయి సై సై
నువ్వేసే చుక్కకన్న ఎచ్చునైన దాననోయ్
కవ్విస్తే కరిగేదాకా కదలనోయ్ హోయ్ ॥ఈ॥

కండలున్న మామయ్యకు గుండేలేదట
గుండెలున్న బావయ్యకు గుణమే లేదట
కండలున్నా గుండెలున్నా కన్నెపిల్ల రమ్మంటే
కత్తిలాంటి మగరాయుడు మెత్తనౌనట. ॥ఈ॥

ఇంపుచూసి నా వంపుచూసి నువు వలవేయకోయ్
సెంపమీద అబ్బ! నువ్వు నొక్కినొక్కి చిటికెవేయకోయ్
పట్టుపట్టీ పంతగించీ పైటలాగకోయ్
నా పైటలాగితే మనసు పట్టజాలనోయ్. ॥ఈ॥

★ ★ ★

# పట్టుకుంటే పదివేలు-1967

నవజ్యోతి ఫిలిమ్స్ సంగీతం : టి. చలపతిరావు

పాడినవారు: జయదేవ్, వసంత బృందం

ఎ ఫర్ ఏపిల్
బి ఫర్ బిస్కెట్
సి ఫర్ ఛాకలెట్
డీ ఫర్ డాంకీ –
నో నో నో నో – డాడీ. ॥ఏ॥

తెలుగు ఇంగ్లీషు రెండూ చక్కనివే
తేనె చక్కెరలు రెండూ తీయనివే
అఆ ఇఈలు అందం చిందాలి
ఏబిసిడీలు తెలివిని పెంచాలి. ॥ఏ॥

పాఠశాలకు వెళ్లేటప్పుడు టాటా చెప్తాము
దారిలో టీచరు కనబడితే – దండం పెడతాము
పేర్లు వరసగా పిలిచేటప్పుడు ప్రెజెంటు అంటాము
జనగణమన అని పాడేటప్పుడు కదలక నిలబడతాం
నిన్న – అంటే ఎస్టర్ డే – నేడు అంటే టుడే ॥ఏ॥

ఆశలు రేపే రేపు అంటే డే – టుమారో
వెరీగుడ్ వెరీగుడ్
బట్టీపట్టీ చదివితే ఫలితం గుండుసున్నా
మనసుపెట్టి చదవకపోతే మార్కులు రావన్నా
చదివేటప్పుడు చదవాలి

ఆడేటప్పుడు ఆడాలి
సరదాగా కలిసీ మెలిసీ చక్కగ పాడాలి ॥ఏ॥

భారతభూమి కాపాడుటకై మీరేం చేస్తారు?

పటాలమందున తుపాకిపట్టి పహరా యిస్తాము
అన్యులు వచ్చి దాడిని చేస్తే అపుడేం చేస్తారు
హద్దులు దాటి పగవాడొస్తే ఫుట్‌బాలాడేస్తాం

తెలుగుతల్లినీ సేవిస్తాం— భరతభూమిలో జీవిస్తాం.

★ ★ ★

# గోపాలుడు భూపాలుడు-1967

గౌరీ ప్రొడక్షన్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

**1**

**పాడినవారు: ఘంటసాల, ఎస్. జానకి**

ఒకసారి కలలోకి రావయ్యా నా ఉవ్విళ్ళు
కవ్వించి పోవయ్యా ఓ గొల్ల గోపయ్యా

ఒకసారి రాగానె ఏమౌనులే నీ హృదయాన
శయనించి వుంటానులే ఏలుకొంటానులే

పగడాల నా మోవి చిగురించెరా
మోము చెమరించెరా మేను పులకించెరా
సొగసులు వేణువు చేసి పలికించరా ॥ఒ॥

కెమ్మోవిపై తేనె ఒలికించనా
తనివి కలిగించనా మనసు కరిగించనా
కేరింతలాడించి సోలించనా
వంపు సొంపుల మెరుపు మెరిపించవే
వగలు కురిపించవే మేను మరిపించవే
మరపులో మధుకేల రగిలించవే ॥ఒ॥

చిలిపి చూపుల సిగ్గు కలిగిందిరా
మొగ్గ తొడిగిందిరా, మురిసి విరిసిందిరా
పదను తేలిన వలపు పండించరా. ॥ఒ॥

★ ★ ★

# ఉపాయంలో అపాయం-1967

విజయవర్ధన్ మువీస్ సంగీతం : కె. వి. మహదేవన్

**1**

పాడినవారు: పి. సుశీల

చిన్నారి పొన్నారి చిట్టిపాపా
ఇన్నాళ్లు ఏమైనావే చిట్టిపాపా
అల్లారుముద్దుగా బంగారుకొండగా – నాకు
చెల్లాయివైనావ చిట్టిపాపా. ॥చి॥

వేయవమ్మ వేయవమ్మ తప్పటడుగులు
చెప్పవమ్మ చెప్పవమ్మ చిలకపలుకులు
నాన్న రేపు కొంటాడు కొత్తకారు
అందులోన పోదాము గాలిషికారు ॥చి॥

కాకిపిల్ల తెస్తుంది కళ్లకాటుక
బొట్టు మనకు పెడుతుంది బొంతపిచిక
నైలాను జాకెట్టు పట్టు పరికిణీ
సరదాగా ఎంచక్కా నీకు తొడగనా ॥చి॥

మేళాలు తాళాలు మోగుతాయి
మేనత్త కొడుకు బలె ఆకతాయి
పిలవకనే వస్తాడు పెళ్లికొడుకు
తలవంచుకు నీవేమో సిగ్గుపడకు ॥చి॥

**2**

**పాడినవారు: పి. సుశీల**

నిషా ఎందుకు నేనున్నాను
కుషీ కోరిక తీరుస్తాను ||ని||

కొంగు తగిలితే మనసు పొంగును
కొసరి పిలిచితే నోరు వూరును
కొనచూపు చూసి కొనగోట తాకి
పెనవేసు కొనగానె తనివి తీరును ||ని||

పచ్చిపాలపై నురుగవున్నదీ
పడుచుగుండెలో మైకమున్నదీ
తెలివివుంది నాకు – బలముంది నీకు
గెలుపింక మనదేనులే – దిగులు ఏలనో. ||ని||

* * *

# సాక్షి-1967

నందనా ఫిలింస్ సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు: పి. సుశీల

అటు వెన్నెల – ఇటు వెన్నెల
ఎటు చూస్తే అటు వెన్నెల
ఓరందగాడ బంగారు సామి
నా మనసు ఎవరి పాలు సేతురా
ఈ వయసు ఎవరి పాలు సేతురా ॥అ॥

మీదజూస్తే చందమామ
కిందచూస్తే తెల్ల కీలువ
మల్లెమొగ్గల నవ్వు నవ్వకురా
ఓరందగాడ బంగారు సామీ
నవ్వులోన తెల్లవారునురా. ॥అ॥

ఏరులాగ ఎన్నెలంతా జారి జారి పారిపోతే
ఏటి కెడదర అడ్డమేసెదరా
ఓరందగాడ బంగారు సామి
నీటిమీదే కొంగు పరతునురా ॥అ॥

ఆశపెట్టే లేతపెదవి ఆవులించే దోరవయసు
కన్ను నిన్నే కౌగలించెనురా
ఓరందగాడ బంగారు సామి
నిన్నుజూస్తే మనసు నిలువదురా
ఇలా నిన్ను జూస్తే మనసు నిలువదురా. ॥అ॥

## 2

పాడినవారు: పి. సుశీల. పి. బి. శ్రీనివాస్ బృందం

దయలేదా నీకు దయలేదా
ప్రాణసఖునిపై దయలేదా
చిటపట చినుకుల దుప్పటి తడిసెను
కటకట నాపై దయలేదా
నడివీధిలోనే నడిరేయిదాటె
పడతిరో యిసుమంత దయలేదా
రాధా చూడు బాధా కరుణలేదా అలుకపోదా
ఏలా పంతమేలా తాళజాలా విరహజ్వాలా

చాలు నీ పదాలు బూటకాలు, నాటకాలు
ఆలు ఎ(త్రతేలు దానికాలు నీకు మేలు
సత్యమీద చూపించు హెచ్చుతున్నవలపు
తట్టి తట్టి ఏడ్చినా తీయనోయి తలుపు
దయచేయి నువ్వు దయచేయి - దాని యింటికే దయచేయి
అలదాని ఇంటికే దయచేయి

భామా సత్యభామా విజి హేమా చూడుప్రేమా
ఒట్టు నన్నుతిట్టు జడనుకొట్టు వలదు బెట్టు
మగువ లెందరున్ననూ మరులుకొంది అత్త
మగవారి మోసాలు మాకు కావు కొత్త
కల్లబొల్లి మాటలు మేము యింకనమ్మం
వెళ్లు వెళ్లు చేరుకో రాధ పెరటి గుమ్మం
దయచేయి నువ్వు దయచేయి
దాని యింటికే దయచేయి
అల దాని యింటికే దయచేయి

దయలేదా మీకు దయలేదా
ప్రాణసఖునిపై దయరాదా
బ్రతుకు వీధిపాలాయెను దయలేదా

[అంతట కపటనాటక సూత్రధారియగు మురారి అమ్మగువల
నెమ్మనంబున తన మాయవల్ల ఏమితోపించినాడన]
తా నొక్కడే మగడు - వానికెందరో సఖులు

సొగసే తేనెకు తుమ్మెద - జగతిని
వేవేల లతల చరియించలేదో
మగవాడు నటులెకాదా
మగువా నీ మనసులోన మచ్చరమేలే

అంతట అయ్య గానామణులు తమం ముంగిళ్ల వీడి ఏమనుచున్నారనగా
రావోయి కృష్ణ రావోయీ - రాధ యింటికే రావోయి
ప్రేమధామం యింటికే రావోయి
రావోయి కృష్ణ రావోయీ భామ యింటికే రావోయి
ముద్దు భార్య ఇంటికే రావోయి
[అహః మీ ఇద్దరూ నేస్తం కడితేగాని రాను - అని
చేతులు కలపుమన్నాడు]
రావోయి కృష్ణ రావోయి
రాసక్రీడకు రావోయి
అలరాసకేళికే రావోయి.

**3**

**పాడినవారు: పి. సుశీల**

అమ్మకడుపు చల్లగా అత్తకడుపు చల్లగా
బతకరా బతకరా - పచ్చగా
నీకు నేనుంటా వెయ్యేళ్లు తోడుగా - నీడగా ||అ||

నా మెడలో తాళిబొట్టు కట్టరా
నా నుదుటన నిలువుబొట్టు పెట్టరా
నీ పెదవి మీద సిరునవ్వు సెరగదురా
నా సిగపూల రేకైన వాడదురా - వాడదురా
బతకరా బతకరా పచ్చగా ||అ||

చల్లని అయిరేణికి మొక్కరా
సన్నికల్లుమీద కాలు తొక్కరా

చల్లనేళ కంట నీరు వద్దురా
నా నల్లపూసలే నీకు రక్షరా రక్షరా
బతకరా బతకరా పచ్చగా ||అ||

నా కొంగు నీ కొంగు ముడివేయరా
నా చేయి నీ చేయి కలపరా
ఏడడుగులు నాతో నడవరా
ఆ యముడైనా మన మద్దికి రాడురా రాడురా
బతకరా బతకరా పచ్చగా. ||అ||

పాడినవారు: మోహన్‌రాజు

పదిమందికోసం నిలబడ్డ నీకు
ఫలితం ఏమిటి? యమపాశం
ఎవరికి వారే యీ లోకం – రారు ఎవ్వరూ నీకోసం

నిజము నిప్పులాంటి దెప్పుడూ
నిన్ను దహించక తప్పదూ – లేదు లేదురా న్యాయము
నీకు చావు ఒక్కటే సాయము
నిట్టూర్చె గాలి నిదురించె భూమి
నిను చూసి నవ్వింది ఆకాశం ||ఎవరికి వారే||

వేసిన తలుపులు తీయరు – మూసిన కన్నులు తెరవరు
ఎంత పిలిచినా పలకరు
నీకై రవంత కన్నీరు విడువరు
చుట్టాలు లేరు – పక్కాలు లేరు
నీ నీడతో చేయి సావాసం ||ఎవరికి వారే||

చందమామా నిజము చూడకు
చూసినా సాక్ష్యం చెప్పకు
పరుగెత్తి వస్తోంది రాహువు
అయ్యో తరిగిపోతున్నది ఆయువు
దైవానికైనా దయలేదు లేదు
ఒంటరిగా చేరవోయి కైలాసం. ||ఎవరికి వారే||

★ ★ ★

# స్త్రీజన్మ-1967

సురేష్ కంబైన్స్ సంగీతం : ఘంటసాల

పాడినవారు: పి. సుశీల, ఘంటసాల

హల్లో అన్నది మనసూ
చెలో అన్నది సొగసూ
పరేనన్నదీ –
సై అన్నదీ
హుషారైన వయసు
ఉక్కిరిబిక్కిరి చేస్తానందీ
ఒంపులు తిరిగే పొంకం
కం – కం,
చక్కిలిగింతలు పెడతానంది
పెంకితనాల బింకం
ఓయ్ – ఓర్వనిలోకం పగ్గాలేస్తే
తెంచమన్నది – ఆవేశం ॥హ॥

జీవితమంతా సెలవు
లవ్ లవ్
ప్రేమించడమే చదువా
హోయ్ చిలిపిచూపుల భావం
చదవక వచ్చే పాఠం
హోయ్ జిలిబిలి కోరిక
పరీక్ష పెడితే
జైహిందే అన్నది ఆనందం
హోయ్ – హోయ్.

★ ★ ★

# సుఖదుఃఖాలు-1967

శ్రీవిజయభట్ మువీస్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రమణ్యం

పదారు నావయసు
పండింది నా సొగసు
పడుచుగుండె తెలుసుకోలేవా
ఓహో బావా – ఇలా రారా దోచుకోవా ॥ప॥

చిలిపిగా నవ్వకు వలపులే పొంగును
కొంటె కొంటె చూపులన్నీ గొడవ చేసెనోయ్
గులాబి బుగ్గలపై ఫలాన గుర్తులతో
సరాగమాడినచో చల్లని మైకం ॥ప॥

నడకలో హంసలు – నవ్వులో చిలుకలు
గొంతులోన వంతపాడు కోయిలున్నది
చెలాకి నా పరువం జిలేబితీపి సుమా
అందాల నా హొయలు ఆరగించుమా. ॥ప॥

* * *

# వీరపూజ-1967

విజయసారథి ప్రొడక్షన్స్ సంగీతం : ఘంటసాల

పాడినవారు: ఘంటసాల

అద్దరిని వున్నాడు అందగాడు
ముద్దరాల నిన్నేమో రమ్మన్నాడు నీ
అద్దమంటి చెక్కిళ్లు చెమరుస్తాడు
లేతలేత సొగసులు – లేనిపోని సిగ్గులు
చినవాడు చెయ్యేస్తే విరిసే మొగ్గలు ॥అ॥

మేను పులకరించ విరితేనె చిలకరించ
మిసమిసల పరువాలు ఊసిగొలిపేవాడు ॥అ॥

మసక చీకటిలో మల్లె పందిరిలో
కొసరే అందాలు కొల్లగొట్టువాడు
కైపులోన ముంచి మైమరపులోన వుంచి
కవ్వించి నవ్వించి కరిగించేవాడు ॥అ॥

* * *

# సరస్వతీ శపథం-1967

శ్రీవిజయలక్ష్మి పిక్చర్స్ సంగీతం : కె. వి. మహాదేవన్

పాడినవారు: పి. సుశీల

కళలన్ని విలసిల్లు కాంతుల వెదజల్లు
సంగీత సాహిత్య సంపదల పుట్టిల్లు
తల్లి భారతి మమ్ము బ్రోచుగాత
చల్లగా వెలసి వరములనిచ్చి మెచ్చుగాత

గోమాతా సకల కులమాతా
కులవనితల నతులందెడు గుణమాతా
భువనమ్ముల స్తుతి పొందెడు శుభచరితా – విమల గోమాతా ॥గో॥

పాలొసగు కలిమిగా తల్లిలాగ
ప్రియమగు రూపమున పిల్లలాగ
కరుణాభరిత గంగలాగ
కన్నులకు కనిపించెడు జీవధారా – విమల గోమాతా ॥గో॥

కరగబోని మనసుకూడ కరుగును – నిను
కనుగొనగ సంతసము కలుగును
ప్రజ కాచెడు నిధి నీలో వసించు – నిన్ను
మది నమ్మిన చిర స్వప్నం ఫలియించు

జగన్మాతా పరంజ్యోతీ జనయిత్రీ ఘననేత్రీ
గుణదాయిని శుభదాయిని సుఖదాయిని – సురదాక్షీ
లోకాలను కరుణించు – లోటుదీర్చి పాలించు. ॥గో॥

## 2

'బృందగానం

హరిః ఓం నమో నారాయణాయ నమః
పలు ఏండ్లు పలు ఏండ్లు
పలువేల వేలేండ్లు పలుకోటి నూరేండ్లకున్
ఆది మల్లురను గెలుచు మణివర్ణాన్
చరణాల సిరికి తిరురక్షా!

**పాడినవారు: పి. సుశీల**

ఆలించి పేదర్ని పాలించవమ్మా – నన్ను
లాలించి వెన్నెలలే వెదజల్లవమ్మా
చీకట్ల వార్ధిన గతిలేదమ్మా – నా
జీవితాన అంతులేని వేదనలమ్మా ॥ఆ॥

పక్షులకో గూడు కలదే పశువైతే శాల కలదే
మానవుల జాతికే దుఃఖాలమ్మా
అమ్మా లక్ష్మమ్మా
వెతలు బాపి ప్రాణాలే వెలిగించమ్మా ॥ఆ॥

భిక్షం పాయసం ప్రతి మెతుకూ పరమాన్నం
తల్లివై మాదాకబళం పడవేయవమ్మా
అమ్మా లక్ష్మమ్మా
నీవే నీడవై ఆదరించి నిలబెట్టమ్మా. ॥ఆ॥

## 3

**పాడినవారు: ఘంటసాల**

విద్యయా విత్తమా వీరమా
తల్లియా తండ్రియా దైవమా
ఒక్కొక్కరు వేరొకరిని ఓడింతురా – ఇందు
ఎక్కువలు తక్కువలు విభజింతురా

కవిరాజు శ్లోకములు ఇలు నింపవే - సొమ్ము
కలవార్ని లోకములు భూషింపవే
కవిరాజు భువిరాజు బలవంతులా - వీరం
కనలేని మనుగడలు వర్ధిల్లునా ॥వి॥

పండితులు చదువేమి సభకెక్కునా - గొప్ప
పండితుల సిరికీర్తి ప్రభలీయవా
పండితుని మండితుని ఎవరైనను - బలం
ప్రకటింప వీరునికి సరితూగునా ॥వి॥

ఒకచోట వుండేది చదువే కదా - ఇలా
ఒక ఇంట వుండనిది సొమ్మేకదా
ఒకనాడు ఉడిగేది బలమే కదా - మూడు
ఒక యెడల ఉన్న ఘనమే కదా. ॥వి॥

భోగాల మురిపించు చిరభాగ్యము - సర్వ
భువనాలు పూజించు విజ్ఞానమూ
ఓటమి పొందనట్టి మహద్వీర్యమా - మూడు
ఒకచోట జోడింప విధి శక్యమా. ॥వి॥

పాడినవారు: పి. సుశీల

కలదు కలండనెడువాడు
కాపుర ముండేది ఎచట? కనబడునది ఎచట?
దేవుని గృహమది ఎచట? - అదెచట వేరెచట
తరగని జ్ఞానం తెరిచిన హృదయం
నిలిచెడి దెచటో అచట ॥దే॥

భోగము పొంకము చెడినగిగెడు హృదయం
బొంకులె పెరిగిన కాడు
రాగం నాదం అలరెడు హృదయం దేవుడు తిరిగే పెరడు ॥దే॥
మెరిసేనగలూ ఆడంబరములు దేవుని మక్కువకాదే
అచటో కన్ను ఇచటో కన్ను అబలయ విధమేకావే
అలలై కలలై కవితల తరలే పలుకులే దేవుని చోటు

ఇదియే దైవం అన్నది తెలిసిన ఎన్నడు వుండదు లోటు
దైవం ఎన్నడు వుంచదు లోటు ॥దే॥
సత్యార్థ కలవారెచట ధర్మము కలవారెచట – అచటే దైవం
పేరిమి కలవారెచట దైవం అచటే
ప్రేమల మనువారెచట దైవం అచటే. ॥దే॥

పాడినవారు: పి. సుశీల

కువకువలాడును అందాలే
కోటికి పడగలు వైభోగాలే
లోకం నా ముందే – పాడును సుమా
లోకేశ్వరి నేననుచు – చాటుసుమా
పున్నమి నా ప్రతిబై వెలుగుసుమా
భువిని జయఘోషే పలుకుసుమా ॥కు॥

పాలకులు పరిపాలితులు – నా
కనుమూసి తెరచిన – సభనిండు
నా దివ్య కీర్తియే నినదించు
వేనుండు చోటే సిరిమించి ॥కు॥

నాడును నగరము నాలుగు బలములు
నవరత్న భవనములు నా వశమే
కోరెదు రాజ్యాలు పెరిగెడు భోగాలు
కొలిచెదు భువనాలు – నా వశమే. ॥కు॥

6

పాడినవారు: ఘంటసాల.

రాణి మహారాణి రాశిగల రాణి
వింత వింత పంతమందు శాంతిలేని రాణి
నిన్నవరకు వీధియందె నిలచినట్టి రాణి
నిన్న పడిన పాట్లు మదిని తలచనట్టి రాణి
దండ పట్టపేన్గు వేయ దశపట్టిన రాణి
కీలుబొమ్మ పోలెవచ్చి కొలువుసేయు రాణి ॥రాణి॥

దేహమంత పసిడి భూషణాలు దాల్చి
తెలివియున్న పండితునితో పోరగావచ్చె
పొంగిపొరలు కలిమిచేత బుద్ధిమునిగెనంత
పుణ్యపురుషు కవితతోడ పోరగవచ్చె

కవిరాజుల భువిరాజుల ఓడు కొట్టుతుందా
సరస్వతిని సంపదలే గెలుచుకొనుట వుందా
దివ్యమైన బుధవరులకు చెరమూ ఒక పెరడు
తెలివిలేని రాణులకో – సిరులే ఉరిత్రాడు. ॥రాణి॥

* * *

# మరుపురాని కథ-1967

శ్రీ ప్రొడక్షన్స్ సంగీతం : టి. చలపతిరావు

**1**

పాడినవారు: పి. సుశీల

కళ్యాణమే – వైభోగమే
అందాల పెళ్లికి ఆనందమే. ||క||

ముత్యాల పల్లకిలోన
రత్నాల కాంతులతోన
వయ్యారి మా వదిన వస్తుందట
సరదాల సారెలు తెస్తుందట ||క||

తన రాజు రీవిని చూసి
నునులేత సిగ్గులు పండి
వన్నెలాడి ఉయ్యాల కదుతుందట
పండులాంటి పాపణ్ణి కంటుందట ||క||

మేనల్లుడి అందం చూసి
మేనరికం మేలిమి తలచి
మేనత్త నోములన్ని పండేనట
అన్నతోనె వియ్యాలు అందేనట. ||క||

**2**

పాడినవారు: ఘంటసాల

నూటికొక్క మనసే కోవెల
కోటికొక్క మనిషే దేవత
భూమిమీద దేవతవే మొగ్గ విడని మల్లికవే
ఎన్నటికీ బోధపడని సామెతలే ॥నూ॥

పూలకన్న నీ చూపులు మెత్తన
తేనెకన్న నీ మాటలు తీయన
మంచుకన్న నీ హృదయం చల్లన
మరపురాని నీ నవ్వే – దీవెన ॥నూ॥

నీకేమో బొమ్మరిల్లు లోకము
నీతో అది ఆడెను చెలగాటము
జాలిలేని నీలినింద మరిచిపో
నాలోనే కలకాలం నిలిచిపో. ॥నూ॥

* * *

# రహస్యం-1967

లలితా శివజ్యోతి ఫిలిమ్స్ సంగీతం : ఘంటసాల

**1**

పాడినవారు: పి. లీల, పి. సుశీల

ఇదియే దేవరహస్యం
హృదయాంతరంగ చిరలాస్యం ॥ఇ॥

ఇదియే దేవరహస్యం
హృదయాంతరంగ చిరలాస్యం ॥ఇ॥

మోహన కాంత మురిపించే వేళ
మొలక నవ్వులై విరియునులే
ముక్తికాంత లాలించే వేళ
పులకరింతలై వెలయునులే
ఇరులు తెరలు తొలగించునులే ॥ఇ॥

తపము చేసి ఏ సిద్ధి పొందినా
తామసాన యిది దొరకదులే
తేజమంది ఏ తీరు వెలిగినా
రాజసాన యిది పొందదులే
సాత్వికాన సాధింతురులే. ॥ఇ॥

★ ★ ★

# భక్త ప్రహ్లాద-1967

ఎ. వి. ఎమ్. ప్రొడక్షన్స్ సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

**1**

పాడినవారు: బాలమురళీకృష్ణ, ఎస్. జానకి

సిరి సిరి లాలీ చిన్నారి లాలీ
నోముల పంటకు నూరేళ్లు లాలీ
ఊగుమా — ఊయెలా ॥సి॥

పాల కడలిలో జాబిలి రీతి
వరలుము రతనాల గారాల బాల
ముద్దుల మాట మురిపాల తోట
ముసి ముసి నవ్వుల ముత్యాల కోట
ఊగుమా — ఊయెలా ॥సి॥

పదునారులోకాలు తరియింపజేయ
ప్రభవించినావయ్య వరభక్త శీల
కలలెన్నొ నీ కొరకు కాచుకొని పూచె
ఫలియింప చేయుమా అరుదైన బాల
ఊగుమా — ఊయెలా ॥సి॥

కులదీపమై వెలుగు కొమరుని చూసి
దీవించు నీ తండ్రి ఎచ్చోటనున్నా
నీవారి ఆశలు నెత్తావులీని
నిరతము నీ కీర్తి వికసించునన్నా
ఊగుమా — ఊయెలా. ॥సి॥

* * *

# లక్ష్మీనివాసం-1967

వీనస్ పద్మినీ కంబైన్స్ సంగీతం : కె.వి. మహదేవన్

## 1

పాడినవారు: పి. సుశీల

నవ్వు – నవ్వించు – ఆ నవ్వులు పండించు
ఊహ – ఊహూహూ... నా ఊహలు లాలించు
నాలో వయసుంది నవనవలాడింది
నీలో మనసుంది నిగనిగలాడింది
కువకువలాడే కోరికలన్నీ ఘుమఘుమలాడాలి ॥న॥

ఎదుటను నీవుంటే ఏదో సిగ్గుసుమా
చిలిపిగ చూస్తుంటే – తలపులు రేగుసుమా
రెక్కలు విప్పి టక్కరి వలపు రెపరెపలాడాలి ॥న॥

ఆశలు పొంగాయి అల్లరి చేశాయి
నీలో ఉబలాటం – నాలో చెలగాటం
తొందరచేసే అందం పూచి పందిరి వేయాలి. ॥న॥

## 2

పాడినవారు: మాధవపెద్ది

బోటిరో మేనకా మనకు బోలెడు పిల్లల మందలేల – ఝుం
ఝూటముపెట్టుకోకు మనసార హుషారు షికార్లలో – నిరా
ఘాటముగా చరించుటకు కమ్మని పద్ధతి నేర్చుకో – ప్రజా
టోటలు పెంచబోకుము – కుటుంబనియంత్రణ మాచరింపుమా.

## 3

పాడినవారు: మాధవపెద్ది

కాలేజీ జీతమ్ము కట్టమంటే మాని
పెనుకళాసేవలో పెట్టినాను
తల్లి తండ్రుల నుండి తస్కరించిన సొమ్ము
దోసిళ్లతో తెచ్చి పోసినాను
ఆస్తి ఆర్నెల్లలో నాస్తి క్లోజనిపించి
చేబదుళ్లెన్నియో చేసినాను
ఎంత వడ్డీకైన ఇసుమంత జంకక
బరబరా ప్రోనోట్లు బరికినాను
కటిక మార్వాడి కాబూలి కత్తులందు
తుదకు గతిలేక నా తల దూర్చినాను
కాని మునిగిపోవక ముందె కనులు తెరచి
కోలుకొంటిని కాబట్టి – కొంత నయము.

## 4

పాడినవారు: పి. సుశీల, పి. బి. శ్రీనివాస్

చేయీ చేయీ కలుపు
చెంపా చెక్కిలి కలుపు
కేరింతలతో వూరింపులతో
కిలకిల కలకల నవ్వు... ॥చే॥

నా కోర్కెలు గుఱ్ఱాలైతే
ఎగరేసుకుపోతా నిన్నే

నీవంతటి మగసిరివైతే
నా అందాలిచ్చెద నీకే

నీ కన్నుల కాపురముంటా
కనురెప్పల తలుపులు తియ్యి

నీ నీడకు తోడుగ వుంటా
నీ బాసలు బాసట చెయ్యి ॥చే॥

నీ వలపులు ఎంతో యింపు
నా దోసిలి నిండా నింపు

నిను వీడని మైకమునవుతా
నా మమతల మధువులచేత

పది చేతులు నాకే వుంటే
బంధించెద బిగువుగ నిన్నే

జవరాలిని పిడికిట నిలిపే
మొనగాడివి నువ్వే నువ్వే.

## 5

పాడినవారు: పి. బి. శ్రీనివాస్, పి. సుశీల

ఓహో ఊరించే అమ్మాయీ
నేనేమి చేసేది
అందాల కన్నులు నన్ను తొందర చేశాయి

ఓహో వేధించే అబ్బాయి
నేనేమి చేసేది
చూపుల్లో కైపులు నన్ను బిత్తర చేశాయి

నీ పైట చెంగు కొస ఎగిరింది
నా పడుచుగుండె ఉసి కొలిపింది

నీ చిలిపి పెదవి నను పిలిచింది
నా చెక్కిలి ఓయని పలికింది

నీ ఓర చూపులో ఒగరుంది
నా దోర వయసులో పొగరుంది

నీ కోడె వయసులో వేడుంది
నా కొంటె తలపుతో రగిలింది

నీ లేత వలపు చిగురేసింది
విరజాజిలాగ పెనవేసింది

నా మేని సొగసు విరబూచింది
నీ కంటికి కానుక చేసింది.

# 6

**పాడినవారు: ఘంటసాల**

ధనమేరా అన్నిటికీ మూలం –ఆ
ధనము విలువ తెలుసుకొనుట మానవధర్మం

మానవుడే ధనమన్నది సృజియించెనురా
దానికి తానే తెలియని దాసుడాయెరా
ధనలక్ష్మిని అదుపులోన పెట్టినవాడే
గుణవంతుడు – బలవంతుడు – భగవంతుడురా ॥ధ॥

ఉన్ననాడు తెలివికలిగి పొదుపు చేయరా
లేనినాడు ఒడలువంచి కూడబెట్టరా
కొండలైన కరిగిపోవు కూర్చునితింటే – అయ్యో
కూలిపోవు కాపురాలు ఇది తెలియకుంటే ॥ధ॥

కూలివాని చెమటలోన ధనమున్నదిరా
పాలికాపు కండల్లో ధనమున్నదిరా
శ్రమజీవికి జగమంతా లక్ష్మీనివాసం – ఆ
శ్రీదేవిని నిరసించుట తీరనిదోషం. ॥ధ॥

# 7

**పాడినవారు: ఎస్. జానకి**

ఇల్లే కోవెల – చల్లని వలపే దేవత
ఇల్లూ వలపూ నోచిన వనితే – వనిత

నుదుట కుంకుమరేఖ
కంటికి కాటుకరేఖ
జడలో కమ్మని విరులు
యువతికి తరగని సిరులు ॥ఇ॥

తులసికోటలో దీపము
కలకాలము వెలిగే వరము

చెలుని నవ్వుల స్నేహము
నెలతకు జీవన భాగ్యము ॥ఇ॥

చదువులు ఎన్నో చదివిన
పదవులు ఎన్నో ఏలిన

చివరకు గృహిణిగ మారే
పడతుల బ్రతుకే - ధన్యం. ॥ఇ॥

## 8

### పాడినవారు: పి. సుశీల

గువ్వలాంటి చిన్నది తారా
జువ్వలాంటి చిన్నది
వెతుక్కొని వస్తే వెన్నలా కరిగిస్తే - నువ్
ఏంచేస్తావ్ ఏం చేస్తావ్ ఓ మొనగాడా ॥గు॥

మనసైనవాడివని సొగసైనవాడివని
ఆ నోట ఆ నోట విన్నదట - ఆ
విన్నదంత కళ్లారా కన్నదట
నీ గడుసుతనం చూడాలని నీ భరతం పట్టాలని
నలుగురిలో నిలవేస్తే ఏంచేస్తావ్ నువ్
ఏంచేస్తావ్ ఏం చేస్తావ్ ఓ మొనగాడా. ॥గు॥

ముచ్చటైన పొగరుబోతు కుర్రది - అది
పొంకమైన బింకమైన చిన్నది - ఆ
పెంకిపిల్ల నిన్నే కోరుకున్నది
నీ గుండె దోచుకుంది - నిన్ను వలచుకుంది
చల్లగాలి వీచువేళ - చందమామ కాచువేళ
చలిచలిగా వుందంటే - ఏంచేస్తావ్
నువ్వేం చేస్తావ్ ఏంచేస్తావ్ ఓ మొనగాడా. ॥గు॥

# 9

## పాడినవారు: పిఠాపురం

సోడా సోడా ఆంధ్రా సోడా
గోలీ సోడా జిల్ జిల్ సోడా

సోడా తాగు తెలుగోడా – చల్లని సోడా
దీని మహిమ చెప్పలేడు దేవుడుకూడ ॥సో॥

నెత్తిమీద గంగవున్న ఈశ్వరుడైనా – అహ
నిత్య సుధలు తాగుతున్న దేవతలైనా

ఆంధ్రా సోడా కోరికోరి తాగుతారోయ్ – అది
లేకుంటే వడదెబ్బకు వాడుతారోయ్ ॥సో॥

నాయకులు చెప్పేది ఉత్తగ్యాసు – వి
నాయకుల చప్పట్లు శుద్ధగ్యాసు
పోసుకోలు పొలిటిక్సు పరమగ్యాసు
వాటికన్న ఉపయోగం సోడాగ్యాసు ॥సో॥

ఒక్క గుక్క తాగిచూడు మండుటెండలో – అహ
హిమాలయం చల్లదనం నీ గొంతుకలో
రాళ్లుతిని తాగితే జీర్ణమవాలి – ఆ
నీళ్లు తాగితే సగం కడుపు నిండాలి. ॥సో॥

* * *

# రక్తసిందూరం-1967

రిపబ్లిక్ పిక్చర్స్ సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

పాడినవారు: పి. సుశీల బృందం

అల్లీ బిల్లీ పిల్లల్లారా ఇల్లారండి – మీరు ఇల్లారండి
అట్లతద్ది కన్నెనోము నోచాలండి, నేడే నోచాలండి

అందాల హంసతో అలరించే చిలకతో
చిందేసే నెమలితో – తుళ్లి తుళ్లి – ఆడుదాం
ఊరించే వూహలతో కేరింతాలాడుతూ
కోరికలే కలకాలం పండాలీ....
ఓహో పండాలీ.

తొక్కుడుబిళ్ల – దాగుడుమూత
గుడుగుడు గుంజం గుజ్జెనగూళ్లు
ఆడిన నాడు చక్కని మగడు
ఆడని నాడు నంగిరి మగడు
నీకే – నీకే – నీకే ||అల్లీబిల్లీ||

ఉయ్యాల లూగుదాం, సయ్యాట లాడుదాం
ఒయ్యారం ఒలకపోసి పాటలెన్నో పాడుదాం
ఉయ్యాల లూగుదాం – సయ్యాట లాడుదాం

విరజాజి తీగలై విరితేనె వాగులై
పరువాలె కవ్వించి నవ్వాలి అహ అహ

జాబిల్లికన్న చల్లని రాజు – వస్తాడమ్మా నేడో రేపో
వచ్చేవాడు వచ్చిననాడు – ఏంచేస్తావో పిల్లా చెప్పు
నవ్వుతావా సిగ్గుపడతావా – పులకిస్తావా
కాదే! పెళ్లాడి పెనవేసుకుంటుందే
అహహ... ||అల్లీబిల్లీ||

* * *

# ఆడపడుచు-1967

సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ సంగీతం : టి. చలపతిరావు

పాడినవారు: పి. సుశీల బృందం

మది తుళ్లి తుళ్లి తుళ్లి ఎగిరింది
ఊహ ఉలికి ఉలికి పడుతోంది
సిగ్గు చెవిలోన గుసగుసలాడింది ॥మది॥

పెళ్లి చూపుల్లో ఏదో వెరపు
వెళ్లిపోయాక ఒకటే తలపు

రెండు నిముషాలలో కోటి పులకింతలై
నిండు మదిలోన నెలకొంది తన రూపు ॥మది॥

ఏల అదిరింది నా ఎడమ కన్ను
ఏల తనపేరు వూరించె నన్ను

వలపు ఉయ్యాలపై పూల జంపాలపై
ఆశ ఆకాశ వీధుల్లో ఊగింది ॥మది॥

ఇంత సంతోష మిపుడే కలిగె
ఇంక రాబోవు సుఖమెంత కలదో

పగటి కలలన్నియు పసిడి గనులైనచో
పట్టలేదేమొ నా మూగమనసు. ॥మది॥

★ ★ ★

# మంచికుటుంబం-1967

మధు పిక్చర్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: జేసుదాసు, పి. సుశీల, ఎస్. జానకి, రాళ్లబండి

ఓ నవభారత యువతీ యువకుల్లారా
వారి పవిత్ర జననీ జనకుల్లారా
వినండి వినండి ప్రేమపురాణం
వివరించి చూడండి పురాణ సారం

ప్రేమించుట పిల్లల వంతు
దీవించుట పెద్దల వంతు
పెద్దలు ఔనంటే అది ప్రణయం
వద్దని విడదీస్తే అది ప్రళయం

వాడని పూవే నువ్వు – నిను వీడని తుమ్మెద నేను
విరిసిన జాబిలివి నీవు నిను వీడలేని వెన్నెల నేను
ఓ పయనమయే పెళ్లికుమారికా
వినుమా నా కన్నీటి నివేదికా

మనసు నాదైతే నీ మనువు వేరొకరితోనా
మమత నాదైతే – నీ మనుగడ వేరొకరితోనా
నను గన్నవారిని ఎదురాడలేను
మనసైన నిను బాసి మనజాలలేను

లైలా, లైలా, లైలా

ఆనాడే పెద్దలు అంగీకరిస్తే
ఈ గాథ వేరుగా మారేది కాదా?

కాబట్టి ॥ప్రేమించుట॥

ఇంకో ఉదాహరణ. రచన షేక్స్‌పియర్.

ఓ రోమియో ఇఫ్ దై బెంట్ ఆఫ్ లౌ బి హానరబుల్
దై పర్‌పస్ మారేజ్, సెండ్‌మి వుడ్ టుమారో –
ఎ థౌజెండ్ టైమ్స్ గుడ్‌నైట్ రోమియో

మై డియర్ ఎట్ వా టో క్లాక్ టుమారో...

ఐ విల్ నాట్ ఫెయిల్ – గుడ్‌నైట్ పార్టింగ్ ఈజ్
సచ్ స్వీట్ సారో ... దట్ ఐషల్ సే గుడ్‌నైట్ – టిల్
ఇట్‌బి టుమారో!

స్టాప్... ఒబె అండ్ గో విత్‌మీ
హియర్ ఈజ్ టుమైల్ దిస్. విత్ ఎకిస్ ఐ డై

ఉదాహరిస్తే ఎన్నో గాథలు
హృదయవిదారక విషాద చరితలు

స్వయంవరంలో ఎంచుకున్నదీ రాణీ సంయుక్త
చాటెను జనకుడు కూడదన్ననూ చెలుడే – తన భర్త

దేవునివంటి ప్రియుడే దొరికిన జీవితమే ధన్యం
తెగించి చివరకు దీవనలందిన రుక్మిణి కథ పుణ్యం

దేశం ఏదైనా – కాలం ఏదైనా
సందేశం మాత్రం ఒకటే
కాబట్టి... ॥ప్రేమించుట॥

**2**

**పాడినవారు: పి. సుశీల, ఘంటసాల**

నీలో ఏముందో ఏమో
మనసు నిన్నే వలచింది సొగసులన్నీ కోరింది
నీలో ఏముందో ఏమో
మనసు నిన్నే వలచింది సొగసులన్నీ ఇమ్మంది

నీ కాటుక కన్నులలో చీకటి గుసగుసలు
నీ కమ్మని నవ్వులలో వెన్నెల మిసమిసలు
నీ ఎదలో పూల పొదలే పూచి
మధువులు చిందాయి నా మమతలు పెంచాయి ||నీ||

నీ అల్లరి చూపులకే ఒళ్లంతా గిలిగింత
నీ తుంటరి చేష్టలకే మదిలో పులకింత
నీ వంపులలోనా సొంపులలోనా
ఒలుకును వయ్యారం అది వలపుల జలపాతం ||నీ||

నీ పరువం చూడనిచో పొద్దే పోదుకదా
నీ పలుకులు వినకుండా నిదురే రాదుకదా
నీ పరపనలేని నిముషంకూడా ఏదో తెలియని వెలితిసుమా
ఇక నీవే నేను సుమా. ||నీ||

**3**

పాడినవారు: పి. సుశీల, ఘంటసాల

ఎవరూ లేనిచోట – ఇదిగో చిన్నమాట
ఇంకా ఇంకా ఇంకా చేరువ కావాలీ
ఇద్దరు ఒకటై పోవాలీ
చిలిపి వూహలే రేపకు సిగ్గు దొంతరలు దోచకు
జిలిబిలి ఆశలు పెంచకు – పెంచకు పెంచకు
పెంచి నన్ను వేధించకు. ||ఎ||

ఒంపులతో ఊరించకు, ఉసిగొలిపి వారించకు
కలిగిన కోరిక దాచకు – దాచకు దాచకు
దాచి నన్ను దండించకు. ||ఎ||

కాదని కౌగిలి వీడకు, కలలో కూడా కదలకు
కలిగే హాయిని ఆపకు – ఆపకు ఆపకు
ఆపి నన్ను ఆడించకు ||ఎ||

వడిలో చనువుగా వాలకు, దుడుకుతనాలు చూపకు
ఉక్కిరి బిక్కిరి చేయకు – చేయకు చేయకు
చేసి మేను మరిపించకు. ||ఎ||

**4**

పాడినవారు: పి. సుశీల

మనసే అందాల బృందావనం – వేణు
మాధవుని పేరే మధురామృతం. ||మ||

కమ్మని నగుమోము కాంచుటె తొలినోము
కడగంటి చూపైన కడు పావనం ||మ||

రాధను ఒకవంక లాలించునే – సత్య
భామను మురిపాల తేలించునే
మనసార వెరనమ్ము తనవారికి కోటి
మరులందు సుధలందు తనియించునే. ||మ||

**5**

పాడినవారు: ఘంటసాల

ధనము లీయగవచ్చు అసువులీయగవచ్చు
ప్రాణ సఖుని యిచ్చి బ్రతుక తరమె

త్యాగశీలవమ్మా మహిళా అనురాగశీలవమ్మా
తోటివారికై సకలము నొసగే కరుణామయివమ్మా ||త్యా||

నీ చిరునవ్వులు సోదరి జడలో విరిసే మల్లియలు
చల్లని నీ దీవనలు నవదంపతుల వలపుల వెన్నెలలు
నిన్ను వీడిపోయినది వలచిన హృదయం
నీలో మిగిలే స్మృతులే మధురం. ||త్యా||

* * *

# పెద్దక్కయ్య-1967

శ్రీదేవి కంబైన్స్ | సంగీతం : ఘంటసాల

**1**

**పాడినవారు: పి. సుశీల**

చూడాలి అక్కను చూడాలి – రావాలి ఇంటికి రావాలి
కన్నీరు తుడవాలి మా వెన్ను నిమరాలి ॥చూ॥

ఇలువీడి పెద్దక్క వెళ్లిపోయె
ఇంటిల్లిపాదికీ దిగులాయె
చిననాడె మా అక్క కరువాయె
చిన్నక్క చూపులే భయమాయె ॥చూ॥

మా బాధ నాన్నకు తెలుసుగాని
మారింది రాయిగా మనసు
మా అక్క ఏదంటె తిడతాడు
మారాము చేస్తే కొడతాడు ॥చూ॥

మేమేమి పాపము చేశాము
మమ్మేల దూరము చేశారు
మా ఇంట వెలుగే తొలిగింది
మాకింక ఏడుపే దిక్కయింది. ॥చూ॥

* * *

# వీరాంజనేయ-1968

మహీజా ఫిలింస్ సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

వినుమా పావన రుద్ర తేజమున నిత్య బ్రహ్మచర్యంబులో
అనిమాద్యష్ట విశిష్ట సిద్ధుల అనన్యాదృశ్య శక్తినే - చిరం
తన దీర్ఘాయువుతోడ వర్ధిలుము భూతప్రేత సంఘాతముల్
దనుమాడంగల మేటి వౌదు భవదుర్వారి ప్రభావమ్ముచేన్

పాడినవారు: పి. లీల, పి. సుశీల

మనసైన దాననురా - మనసీయరా నగధీరా, ఏలరా, రారా
మగువ నిను పిలువ బిగువా - తగువా
మరులుకొన నేరవా - మనసైనదాననురా
మార సుందరా మనసు పడని - ఏ
రమణినైన కొనగోట తాకవని విన్నానురా
మనసైన బాల నునులేత పరువాల
పండించక మానవని నమ్మి - ఉన్నానురా సామీ ॥మ॥

తగణ గణగణ యని నా
తనువు రవళించెరా
తాకు తద్ధిమిత జేకు కుందరిత
అందమే నినదించెరా
రారా మారాము వలదుర దొరా
శృంగార మధుర బంభరా
సుధలానరా - ఆనరా - ఇది నీపై ఆనరా. ॥మ॥

# బందిపోటు దొంగలు-1968

మాధవీ పిక్చర్స్ | సంగీతం : పెండ్యాల

**పాడినవారు: ఘంటసాల**

కిల్లాడి దొంగ డియ్యో డియ్యో
లొల్లాయి అల్లరికి డియ్యో డియ్యో ||కి||

వాలింది పుట్టపై వల్లంకి పిట్ట
దాని వయ్యారమంతా వలవేసి పట్ట
గుండెల్లో ఏదో గుబులుపుట్టిందీ
ఎంత అణచినా అది ఎగిరెగిరి పడుతుంది ||కి||

పిన్నమ్మో నీ సొగసు సిరిమల్లె సెట్టు
సిరిమల్లె సెట్టేమో సితకా బూసింది
చెట్టు కదలకుండ కొమ్మ వంచాకుండ
పట్టేదేసి పట్టుకెళ్లమంటావు – ||కి||

దోబూచులాడేవు దొరసానిపిల్లా ఆ ఆ హోయ్
దోబూచులాడేవు దొరసాని పిల్లా
తోట వాకిలికాడ దొంగలున్నారు
దాచుకో బుల్లెమ్మ దాచుకో నీ వయసూ
ఆహ ఉహు – ఆహోహో
దాచుకో దాచుకో దాచుకో బుల్లెమ్మా
దాచుకోమంటేను దోచిదోచి పెడతావు. ||కి||

## 2

**పాడినవారు: పి. సుశీల**

ఏయ్ కిల్లాడీ
కిల్లాడి దొంగ డియ్యో డియో
నీ లొల్లాయి బూటకం డియ్యో డియో ॥కి॥

వాలింది పుట్టపై వల్లంకి పిట్ట
దాన్ని పట్టగా ఎక్కావు ములగా చెట్టే
గుండెల్లో ఏదేదో గుబులు పుట్టిందీ
అణచితే అదికాస్తా అడ్డు తిరిగిందీ ॥కి॥

మెత్త మెత్తనివాడ మేనత్త కొడుక
కత్తి పువ్వుగ మారె కంగారుపడక
వన్నె చిన్నెలు దోచ వలవేయనేల
కన్నె వలపందుకో కన్నయ్య దొంగ ॥కి॥

వేషాలు వేశాము వెఱ్ఱి నా రాజా – నీ
వేషాలు వెలితిగా వెల్లడైపోయె
తెలుసుకో ఓరయో తెలుసుకో మనసు
తెలుసుకో తెలుసుకో తెలుసుకో మనసు
నీ తెంపరితనమంతా తెల్లారిపోయె. ॥కి॥

## 3

**పాడినవారు: పి. సుశీల, ఎల్. ఆర్. ఈశ్వరి, రాఘవులు**

హైయ్య
హయ్య హయ్య హయ్య
గండరగండ సోగ్గాడవంటా
కండలు తిరిగిన పోరగాడి వంటా
మత్తెక్కిస్తానూ – నిను చిత్తనిపిస్తానూ
మమ్మాత్రే....ఏ–ఏ
ఊసులాడనా ఓసరిల్లినా ఆశలు వుసిగొలపనా
జింగిలిమామా – పైటచెంగున కడతా నిన్ను
వయసు పొంగులకి డంగైపోయేవు

హఁహఁహఁ
గండరగండ సోగ్గాడివంటా – కండలు తిరిగిన పోరగాడివంటా
ఇప్పకల్లులో మత్తు లేదురా – ఎచ్చని పిల్లే నిషా
సురమా కళ్లు సూడు సొంపుల వళ్లు సూడు
మురిపిస్తా కరిగిస్త్రారా (రా

హఁహఁ
అన్నవున్నదూ ఉరిమి చూస్తడు – ఉండర హుషారుగా
చరచరవచ్చి మోట సరసాలాడేవేమో – జాగరత బుడతా

హఁహఁ
గండరగండా సోగ్గాడివంటా
కండలు తిరిగిన పోరగాడవంటా.

* * *

# బంగారు గాజులు-1968

రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ సంగీతం : టి. చలపతిరావు

పాడినవారు: పి. సుశీల, బృందం

వలపు ఏమిటి? ఏమిటి? ఏమిటి?
వయసు తొందర చేయుట ఏమిటి?
ఎచట దాగెను రాగల పెనిమిటి? ||వ||

అల్లరివాడో చల్లనిరాజో - లేక
అందాలు దోచేటి మగరాయుడో
కన్నులు మూసి కపటాలు చేసి - నన్ను
కవ్వించి రగిలించు సుకుమారుడో
ఎవ్వరో - ఎవ్వరో - నవ్వుతూ నవ్వించుమా
ఏలువాడు వాడే - వాడే ||వ||

మగసిరి చూసి మనసే నిలిపి - కన్నె
మదిలోన నునుసిగ్గు లాలించుకో
తారకములన్నీ పొంగేటివేళ - కొత్త
మురిపాల కెరటాల తేలించునో
చిలిపిగా - చెలిమిగా - చనువుగా తనివిగా
చేర రాడే రాడే - నేడే. ||వ||

★ ★ ★

# గోవుల గోపన్న-1968

రాజ్యం ప్రొడక్షన్స్

సంగీతం : ఘంటసాల

పాడినవారు: ఎస్. జానకి, బృందం

హల్లో మిస్టర్ గోవుల గోపన్నా
నీ తలలో తెలివి సున్నా – నిండుసున్నా – గుండుసున్నా ॥హ॥

పల్లెను విడిచి బుల్లబ్బాయి ఎందుకు వచ్చాడే

పెళ్ళిచూపుల బేరంకోసం సంతకు తోలారే
నెత్తిమీద ఒక నోటును పెట్టి వేలం వేశారే

ఎంత పెట్టినా నయాపైసకు ఎవరూ కొనలేదే ॥హ॥

సినిమా చూసి హీరోలాగ వేషం కట్టాడే
సీరియస్సుగా పెద్ద పుస్తకం చేతను పట్టాడే

ఆడపిల్లలు చేరేచోట జెండా పాతాడే
ఐతేగియితే పలకరించితే వెలవెలపోతాడే ॥హ॥

ఎ.బి.సి.డి చదివినరైతు ఏమైపోతాడే
మిస్టరురైతూ చూస్తూవుండగా మినిష్టరౌతాడే –

డిప్టీ మినిష్టరవుతాడే
దండలువేసి బండబ్బాయిని ఊరేగించాలే
వెంగళప్పను తిరుగుటపాలో ఊరికి పంపాలే. ॥హ॥

**2**

**పాడినవారు: ఎస్, జానకి**

హద్దువిడి పెట్టకోయి బావా నువ్వు
ఆమాత్రం ఆగలేవా ॥హ॥

నలుగురిలో బలవంతం చేయకోయ్ – నా
వలపంతా నువు నిలువున దోచకోయ్
తళుకు బెళుకు కులుకులు అడిగినవన్నీ
దాచుకొనక యిస్తానోయ్ – వస్తానోయ్
ఆ సమయం రానీ. ॥హ॥

కవ్వించి నీ కన్నులు మూయనా – నిను
నవ్వించి నా నటనలు చూపనా?
చిలిపి చిలిపి వలపుల కోరికలన్నీ
చిటికెలోనె తీరుస్తా – మురిపిస్తా
ఆ సమయంరానీ ॥హ॥

నా రూపంలో తరితీపులున్నవోయ్
కనుచూపులో ఒక మైకం ఉన్నదోయ్

కొసరి కొసరి నీ కొంటెతనాలన్నీ
కొంగుతోన కట్టేస్తా – కరిగిస్తా
ఆ సమయం రానీ. ॥హ॥

* * *

# గ్రామదేవతలు-1968

సుగంధి ఫిలిమ్స్ సంగీతం : పెండ్యాల

పాడినవారు: ఘంటసాల, జేసుదాసు, వసంత, బృందం

ప్రేమయాత్ర తుది మజిలీ
వెచ్చని హృదయం – ఒక నెచ్చెలి హృదయం
అది దొరకు వరకు ఆపరాదు వలపుల పయనం
తొలి వలపుల పయనం ॥ప్రే॥

దారిలోన అప్సరసలు తారసపడితే
తారసపడి మనసుపడి తత్తరపెడితే
ఏం చేస్తావ్? ఏం చేస్తావ్?
ఆ మదిరాక్షుల ప్రేమ ఏమిటని – ఆదరమున ప్రశ్నించి
విచ్చలవిడియగు తుచ్ఛసుఖముల మెచ్చక తృణీకరించి
మేనకముందర విశ్వామిత్రుని పోజుమోజుగా బిగించి
నిశ్చల నిర్మల ప్రేమతత్వమును – నిరూపించ
ప్రయాణించి తీరెద ॥ప్రే॥

నీ యవ్వనమున లేత పువ్వులు పూసెను
జవ్వని ఎవ్వని కోసమే

మన మనసు మనకే తెలియదు – హాయ్
అయినా మదిలో కోరికల వాన వెలియదు
కలలోని చెలికాడు కలియదు

ఓ పిక్నిక్ వచ్చిన ప్రెసిడెంటు కూతుర
చేయవె వలపుల జాతర

నీకు నచ్చినవాని కిచ్చుటకోసం
తీయవె సొగసుల పాతర ॥ప్రే॥

లోకులంత ఏకమగుచు ఛీంకరించితే
ఛీంకరించి నీ ప్రేమను ధిఃకరించితే
ఏం చేస్తావే ఏం చేస్తావే ఏం చేస్తావే

కడు కఠినాత్ముల కారుకూతలను పెడచెవిన పారేసి

కమ్మని వాంఛలు దుమ్మెత్తినచో - నెమ్మదిగా దులిపేసి
మేలు భళాయని సవాలు చేసి
మీసమ్మును మెలివేసి
చక్కని చల్లని ప్రేమతో జగతిని
జయిస్తాను జయిస్తాను తప్పక. ॥ప్రే॥

పాడినవారు: పి. సుశీల, బృందం

జననీ జన్మభూమి స్వర్గము కన్నను
మేటియనుచు నీవు చాటవలయు
జననీ సేవచేసి జన్మభూమినిగాచి - ఇహ
పరమ్ముల సుఖించవలయు

భారత భూమి మనదే - నవ
భారత భూమి మనదే
పావన భారత సీమను గాచే
భారము మనదే - మనదే. ॥భా॥

కదం తొక్కుతూ – పదం పాడుతూ
కండబలాలూ పెంచాలి
ప్రతి పౌరుడూ మహావీరుడై
పెట్టనికోటగ మారాలీ. ||భా||

చల్లని భారత చరితములన్నీ సప్తస్వరముల పాడాలీ
గానముచేసీ తానముమీటీ కళామూర్తులై మెలగాలీ ||భా||

మనదేశీయులన మహిమలునింపే
మనసే చిందులు వేయాలి
వెనుకటి వీరుల ప్రభావమందూ
తనువులు నాట్యం చెయ్యాలీ ||భా||

ఆడీ, పాడీ, అలసీ సొలసీ హాయిగా నిద్దురపోవాలీ
కలలోనైనా మన స్వాతంత్ర్యం
కాచుకొనుటకై లేవాలీ. ||భా||

* * *

# కోయంబత్తూర్ ఖైదీ-1968

వెంకట సత్యనారాయణ పిక్చర్స్ సంగీతం : కె. వి. మహాదేవన్

పాడినవారు: పి. సుశీల

హృదయం పులకించదా
కన్నె యిదే – వన్నె యిదే
కలియమని చిలిపి వలపు
ఉసికొలిపి అలరించదా. ॥హృ॥

నెలతల చూడని మునివరులు
వలచెడి జిలిబిలి పరువమిది
యౌవనమాధురి భోగమిది
సమ్మోహ రసకలిత పాత్రమిది ॥హృ॥

అందము నిన్నే వలచినదీ
ఆమని రాతిరి నిలిచినదీ
ప్రాయం వెడితే మరిరాదూ
పలుతీయని వలపుల తేలుమిదే ॥హృ॥

చక్కని సమయం వచ్చినచో
సంతోషం నిన్నే పిలిచినచో
నాలో నీవే వెలిసినచో
నాట్యాలాడును వయసోహో! ॥హృ॥

## 2

**పాడినవారు: పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం**

నీ మనసే కోరి రమ్మంది – నిను
నామనసే సుధ యిమ్మంది
నీమాటే ఇక నిజమైతే – తొలి
వలపంతా నీ ధనమంది ॥నీ॥

కులుకులివే వూరించి కొనమంది – నీ
పలుకులలో రుచులే చిలకమంది
తేనియలా వలపె చూడమంది – తమి
తీర్చమనే కోర్కె మానమంది ॥నీ॥

హద్దుమీర ప్రేమ ఆగమంది – యిలా
ఇద్దరినీ బింకం నిలపమంది
వన్నెల వయసే మాటుపరచమంది – నన్ను
వలపుల బాధనే ఓర్చమంది ॥నీ॥

నా మమత ఇదే తెలపమంది – మన
చెలియచటే ఎదల కలపమంది
రాగమందే కలసి మెలగమంది
కౌగిలి విడక కరిగిపొమ్మంది. ॥నీ॥

## 3

**పాడినవారు: పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం**

వలపులు గొనుమా – వన్నెలు కనుమా
ప్రేమ నీకు లేదా?
ఆమని చిలుకవై – ప్రేమల మొలకవై
చెంతకు చేరలేదా – చెలి రగడ చేయలేదా ॥వ॥

మమతల నీయమని – నను నిలిపి – లేత
మనసును దోచెను తొలిచూపే
కమ్మని మనసే దాచినచో
అల్లరి చేయును నీ చూపే ॥వ॥

చెలియగ నీ చేయి ననుడాసి - నా
నా సిగ్గుల చిన్నెలు దూసినది
నీ వయసే యిటు కుసుమించ - ఇది
లాలన చేయగ శుభవేళ ॥వ॥

పరువపు ముచ్చట పిలుచునట - నీ
మెడలో మాలిక వేయునట
తీయని కోరిక రగిలెనట - అది
హాయిగ మిలమిలలాడెనట ॥వ॥

కన్నియ నిన్నే కోరెనట - చేరి
కవ్వించగ పరువం పండెనట
ఇరువురి ఎదలు యిల మరిచెనట - నేడు
అరుదైన సుఖమిది దొరికెనట. ॥వ॥

పాడినవారు: పిఠాపురం, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

వినరా పక్షి వినరా
ఏ్రనా మూర్ఖా - వుడకవు మీ పప్పులు ఎత్తులు పారవురా

ఆశలు మాత్రం బారెడు ఉంటే ఆయాసమొస్తుందా
మీసం మూరెడు పెద్దది వుంటే రోషం వస్తుందా
కాసుల కోసం గడ్డిని తింటే కడుపే నిండదురా
కలబడి మాతో యుద్ధం చేసే ఖలేజా వుందట్రా
చిట్టాడోయ్ చెడతావురోయ్ - చిన్నాడోయ్ ఏయ్ ॥వి॥

దండనలె తప్పిన రౌడీ - ధరణిలో వున్నాడా
తప్పిపోయిన రౌడీ వున్నా - ధర్మం విడువదురా
ధర్మం తప్పి గొంతులు కోస్తే - తగలిపడి పోతావురా
చివరికి తప్పదు చెరలో శిక్ష - చింపిరి బుల్లోడ పోరా ॥వి॥

సూటిబుద్ధి కలదా నీకు - సౌఖ్యం వస్తుంది
చెత్తబుద్ధి కలదా చేతికి - బేడీ పడుతుంది.
ధర్మపథాన్ని విడువని ప్రజకు స్వర్గం వున్నదిరా
దారుణకృత్యం చేసేవారికి - నరకం తప్పదురా. ॥వి॥

# నిండుసంసారం-1968

నవశక్తి ప్రొడక్షన్స్ సంగీతం : మాస్టర్ వేణు

పాడినవారు: పి. సుశీల, బృందం

యువ్వనమే కద అందం – ఆ అందమె మధురానందం
తూరీగలాగ తుళ్లాలి పరువం – పరువాల పరవళ్లే మధురాతిమధురం
కనలేని దృశ్యాలే చూస్తాయి కళ్లు
వినిపించని గీతాలే వింటాయి చెవులు
గాలిలోన తేలి గానమందు సోలే
ఈ పడుచు వయసే – మధురాతిమధురం ॥య॥

గిలిగింత హాస్యాల కేరింతలాడి
పులకించి మైమరచి నాట్యాలు చేసి
తనివితీరేదాకా – పరవశించేదాకా
ఆడేటి ఆటే – మధురాతిమధురం. ॥య॥

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

నా కన్నులు నీకో కథ చెప్పాలి – కన్నుతెరు – కన్నుతెరు
నా కన్నె వలపులో అమృతముంది – చవిచూడు – చవిచూడు
నా మనసుకు వేరే పనులున్నాయి – నన్ను విడు – నన్ను విడు
ప్రేమించేందుకు తీరికలేదూ – చెయ్యి విడు – చెయ్యి విడు

ఆశలు నాలో రేపేవు – అనురాగము నీలో దాచేవు
ఇప్పుడు ఎంత కాదన్నా తప్పించుకు పోలేవు

నాకెన్నో బాధ్యతలున్నాయి నా మదిలో సంకెళ్లున్నాయి
నాతో నీకు వుండదు హాయి ఆశ వదులుకో అమ్మాయి

మనిషంటే మనసుండాలి — మనసుంటే అది ఇవ్వాలి
ఇచ్చిన మనసు నచ్చిన వయసు ముచ్చటతీరా నవ్వాలి

నాలో వున్నది మనసూ ఆ సంగతి నీకు తెలుసూ
వేయకు చెలిమిని అలుసు ఇప్పుడె వేయకు వలపుల గొలుసు

నన్ను విడు నన్ను విడు
ఏయ్ కన్ను తెరు — కన్ను తెరు.

**3**

పాడినవారు: పిఠాపురం

జోరు జోరుగా సాగే కారువే నీవైన
ప్రేయసీ నెంబరు ప్లేటు నేను

ప్రేమలేఖలు వ్రాయ పెన్నువే నీవైన
నెలతరో ఆ పెన్ను నిబ్బు నేను

ఇంపైన సొంపైన హేండు బ్యాగువు నీవు
వెలదిరో ఆ సంచి బెల్టు నేను

కొమ్మరో ఎండలో కూలుడ్రింకువు నీవు
ముచ్చటౌ త్రాగు పుడక నేను

సన్నుతాంగిరో నీ జడ పిన్ను నేను
చక్క చక్కని ఎర్ర లిప్‌స్టిక్కు నేను

కాదు, నునులేత నైల్ పాలిష్ నేను
బోటిరో నమ్మ నీ కాలి బూటు నేను.

## 4

పాడినవారు: పిఠాపురం

మై డియర్ తులశమ్మ క్కా ... క్కా... క్కా
మై డియర్ తులశమ్మక్కా లక్కీ ఛాన్సు కొట్టేశా

మజాగ రేపో మాపో జ్యోతికి తాళి కట్టేస్తా
ఉన్నది అందం ఉన్నది ఆస్తి ఉబికే పొంగే సొంపులు జాస్తి
ఆమెకు నేను హృదయం యిస్తి -
ఆ జ్యోతి లేనిచో బ్రతుకే నాస్తి

వైఫుతో లైఫులో డ్యాన్సులే ఆడుతా
కైపుగా అహఁ కమ్మగా రొమాన్సులో మునుగుతా
జిమ జిమలాడే జాలీ జాలీ జలసాలో వుంటా! ||మై డియర్||

## 5

పాడినవారు: పి. సుశీల

దేవుడున్నాడా? ఉంటే నిదుర పోయాడా?
దారుణాలు చూడలేక రాయిలాగ మారాడా?

మారలేదు చందమామ - మారలేదు సూర్యబింబం
జగతిలోన మార్పులేదు - మనిషి ఏల మారిపోయె? ||దే||

లోకాన బాధలన్నీ - మా కొరకే ఏకమాయె
కష్టాలు మమ్ము చూసి పండుగలే చేసుకున్నాయి ||దే||

నీతికేమి ఫలితంలేదు - స్వార్థానికి విజయం నేడు
కనరాదు ఆశాకిరణం - వలదింక పాడులోకం. ||దే||

★ ★ ★

# భలే మొనగాడు-1968

నందినీ ఫిలిమ్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

**పాడినవారు: ఘంటసాల, పి. సుశీల**

ఏ వూరు నీ పయనం చక్కని మగరాయా
ఏ భామ నోచినదో మక్కువలోని తీయదనం –
నీ మక్కువలోని తీయదనం

మీ ఊరే నా పయనం – చక్కని జవరాలా
నీ మనసే దోచినదీ మక్కువలోని తీయదనం –
నా మక్కువలోని తీయదనం

వెళ్లేవుగాని ఎవరికంటా పడనీయకయ్యా నీ అందం
ఏ యింతులైనా నీ యింపుచూసి దోచుకొనేరు నీ హృదయం

నిను చూసిన నా కనులు రతి అందమైనా కోరవు
తెమ్మన్నవన్నీ తెస్తానుగాని కమ్మని వలపులు ఇవ్వాలి
నే తిరిగివచ్చే తరుణమ్మోదాకా నాలోన నెలకొని నవ్వాలి
కలలోన కనిపించి వలపుల దాహం తీర్చేదా ॥ఏ॥

అందాల పెళ్లి పందిళ్లు వేస్తా రయమున తిరిగిరావాలి
సందిట్లో నిన్ను బంధించగానే కౌగిలి వీడక కరగాలి
ఆనందం – అనురాగం మన మదిలో పండాలి.

## 2

**పాడినవారు: పి. సుశీల**

ఇంద ఇంద తీసుకో – ఇపుడే స్వంతం చేసుకో
ఎంత మందో వచ్చారోయీ అంత మందీ వెళ్లారోయీ
ఇంత చక్కని మగసిరి రీగ ఎవరిలోనూ కనబడదోయి
అబ్బో అబ్బో అబ్బోసి గండరగండ అబ్బోసి ॥ఇం॥

నాలో మురిపాలు పొంగి నీలో మోహాలు రేగె
ఏదో ఆవేశమందు ఎదనే తేల్చరా
ముచ్చట తీరని మనుగడలో – నచ్చిన వరుడే కరువాయె
మోడువారిన ఆడగుండెలో మొదటి వలపే నింపవోయి ॥ఇం॥

రారా అందాలరాజా – రారా సొంపైనవాడా
రగిలే పరువాలు చూడు – మనసే తెలుసుకో
దాచితి నీకై నా వలపు – వేచితి వీణై నీ కొరకు
పలకనట్టి కులుకులు మీటి – ప్రణయరాజ్య మేలవోయీ. ॥ఇం॥

★ ★ ★

# అదృష్టవంతులు-1968

జగపతి పిక్చర్స్ సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

చింత చెట్టు చిగురు చూడు – చిన్నదాని పొగరు చూడు
చింత చిగురు పుల్లగున్నదోయ్ – నా సామిరంగ
చిన్నదేమో తియ్యగున్నదోయ్ – నా సామిరంగ ॥చిం॥

చింత చెట్టు చిగురు చూడు – చిన్నదాని బెదురు చూడు
చింత చెట్టు కాపు కొచ్చిందోయ్ – నా సామిరంగ
చిన్నదేమో దాపు కొచ్చిందోయ్ – నా సామిరంగ ॥చిం॥

పాలవయసు పొందుకోరి పొంగుచున్నది – నా
పైటకూడ వానిపేరె పలవరిస్తది

వగలమారి వాలుచూపు ఎఱ్ఱగున్నది
అది వెంటపడితె ఏదేదో వెఱ్ఱిగున్నది. ॥చిం॥

పగ్గమేస్తె పెంకితనం తగ్గనన్నది
సిగ్గుదోస్తె చిటికలోనె మొగ్గుతున్నదీ

జబర్దస్తీ చేస్తాంది జబ్బమీద వాలుతుంది
అబ్బో ఆ పడుచుదనం తబ్బిబ్బు చేస్తుంది ॥చిం॥

వన్నెమీద చిన్నవాడి మోజుపడ్డది – అది
వన్నెవిడిచి నన్నువిడిచి మళ్లనన్నది

ఇంతలేసి కన్నులతో మంతరిస్తదీ
ఎంతదోచినా కొంత మిగులుతుంటది. ॥చిం॥

## 2

**పాడినవారు: ఘంటసాల, పి. సుశీల**

ము ము ము ము ముద్దంటే చేదా – నీకే ఉద్దేశ్యం లేదా
ఇపుడొద్దన్నావంటే కుర్రవాడా – రేపు
ఇమ్మన్నా ఇస్తానా కుర్రవాడా ||ము||

ము ము ము మ్ముద్దంటే మోజె – ఇపుడా ఉద్దేశంలేదే
నిను ముద్దాడాలంటే కుర్రదానా – అసలు
మనసంటూ వుండలే – వెర్రిదానా ||ము||

పెదవులు రెండూ కలిసినచో – తేనెలు కురిసే ముద్దు
మమతలు రెండూ పెనవేసినచో మమతకు లేదు హద్దు
చూడు వుబలాటం – ఆడు చెలగాటం
పెడమోమైనా విడువను నిన్ను – వద్దుర మొగమాటం

ఆడదాని ముద్దులో వేడి వున్నదోయ్
ఆ వేడికీ వెన్నలాగ కరిగిపోతావోయ్
మోజుపడకుంటె మగవాడేకాదు
గడసరి బిగువు సడలించనిదే – జవరాలే కాదు. ||ము||

## 3

**పాడినవారు: ఘంటసాల, పి. సుశీల**

వా మనసే గోదారీ – నీ వయసే కావేరీ
బోలు రాధా బోలు రెండూ కలిసేనా లేదా
అరె బోలు రాధా బోల్ రెండూ కలిసేనా లేదా

నేనేం చేసేదయ్యో దద్దమ్మవు దొరికావు
అరె, ఏం చేసెదయ్యా – శుద్ధ మొద్దువి దొరికావు
నేనేం చేసేదయ్యా దద్దమ్మవి దొరికావు

కృష్ణుడు నేనే – రుక్మిణి నీవే – రాతిరి ఎత్తుకుపోతాను
లారీ మెల్లగా తోలుకువస్తా చల్లగ లేచీ పోదామూ

మీ యమ్మే యమగండం – మా తల్లే సుడిగుండం
బోలు రాధ బోలు – జోడీ కుదిరేనా లేదా

లా వొక్కింతయులేదు – ప్రాణముల్ రావుల్ తప్పెను
మూర్ఛ వచ్చె మనసే రారెత్తి మా ప్రేమయే
జావై పోయెను గుండెలే పగిలి చస్తామింక దిక్కెవ్వరో

బోలు అమ్మ బోలు జోడీ కలిసిందా లేదా
బోలు అత్తా బోలు రోగం కుదిరిందా లేదా. ॥బో॥

## 4

పాడినవారు: పి. సుశీల బృందం

పడినముద్ర చెరిగిపోదురోయ్ – వన్నెగాడ
పడుచుగుండె విడిచిపోదురోయ్
పెరటిచెట్టు పారిపోదురోయ్ – సోగ్గాడ
పిల్లమనసు మారిపోదురోయ్ ॥ప॥

మచ్చికైన పాలపిట్టనోయ్ – ఓ రాజా నా రాజా
మచ్చికైన పాలపిట్టనోయ్ – వలపంత
ఇచ్చుకున్న కన్నెపిల్లనోయ్
నీ జబ్బమీద పచ్చబొట్టునోయ్ ఔరార
రొమ్ముమీద పుట్టుమచ్చనోయ్ – ఓహోహో ॥ప॥

డేగలాగ ఎగిరిపోతినోయ్ – నిన్ను నేను
తీగలాగ చుట్టుకొంటినోయ్
పాలలోన తేనెకలిసెనోయ్ ఓ రాజా నా రాజా – నేడే మన
పరువానికి పండుగైనదోయ్ – ఓహోహో. ॥ప॥

★ ★ ★

# చిన్నారిపాపలు-1968

శ్రీ మాతా పిక్చర్స్ | సంగీతం : పి. లీల

పాడినవారు: పి. సుశీల

ఓయబ్బో ఏందీ సొగసు – ఒయ్యారం ఒలికే వయసు
తూరీగ రెక్కలమల్లే – తుళ్లింది మనసు ॥ఓ॥

గున్నమావి సిగురుంది – సన్నజాజి గుబురుంది
కొంటెపిల్ల కులుకుల్లోన – పొంగుతున్న పొగరుంది

దోబూచులాడే అందం – దొరకనంది గడుసరి పరువం
దొరబిడ్డ ముక్కుమీద చక్కనైన కోపం ॥ఓ॥

ఏ వూరో తెలియనివాడు – ఏటిగట్టు కాశాడు
ఏవేవో గీతల్లో నా వన్నెలన్ని గీశాడు

సెంపమీద కెంపులు మెరిసి
సిన్నదాని సొంపుల్లోన – సింగారం పండింది ॥ఓ॥

కొండమీద కోనేరు – ఎండలోన కెరటాలు
నీటిలోన కదిలేబొమ్మ పాట పాడి పిల్చింది
మసక మసక మబ్బుల్లోన – మల్లెపూల వాసనలోన
ఏదేదో మైకం నన్ను ఎగరేసుకుపోయింది. ॥ఓ॥

## 2

పాడినవారు: ఎస్. జానకి, రేణుక

నీలో నాలో ఒకటే రక్తం
నీదీ నాదీ ఒకటే ప్రాణం

నువ్వు నేనూ అన్నా చెల్లీ
ఒక్కదేవుడే మనకు తల్లీతండ్రీ

రామచిలుకతో కలిసి ఆడుదామా
కోయిలమ్మతో కలిసి ఎగురుదామా
పావురాలతో కలిసి ఎగురుదామా
పకపకా నవ్వుతూ బ్రతుకుదామా ॥నీ॥

పెద్దవాళ్ల కోపాలు మనకి వద్దులే
పేచీలూ కయ్యాలూ మనకి వద్దులే
అల్లిబిల్లి అల్లరులు అసలే వద్దూ
పిల్లవాళ్ల స్నేహాలే ఎంతో ముద్దు. ॥నీ॥

* * *

# అర్ధరాత్రి 1968

హైదాబాద్ మూవీస్ సంగీతం : మాస్టర్ వేణు

పాడినవారు: పి. సుశీల

ఈ పిలుపు నీ కోసమే – నా మమత నీ కోసమే
వేయి జన్మలనుండి – వేయి కన్నులు తెరచి
వెతికేది బ్రతికేది నీ కోసమే
నెలరాజు తారక చేరునులే
విరజాజి వాసన వీడదులే
నీ నీడవలె మది ఆడునులే – ఈ
తియ్యని కోరిక మారదులే ||ఈ||

కనుపాపల వెలిగే దీపమునై
కలలోపల వెలిసే రూపమునై
తొలిదీవనగా చిరజీవనమై – ఈ
తూరుపుగాలిగ వీచితినీ ||ఈ||

పాదాలను మెరిసే పారాణి
నెవ్యోమమున నిలచే సిందూరం
నీ కానుకలె నెలకొన్నవిలే – నీ
వూపిరిలోనే నా కాపురము. ||ఈ||

**2**

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి, అప్పారావు

ఎగిరిపోయిన చిలుక
ఎచట వాలునో ఎవరికెరుక
పుట్టిన దెచ్చటో పెరిగిన దెచటో
మెట్టె లోగిరి వేరెచటో
తెగిన జీవితపు గాలిపటం
తేలిపోవునది అటో ఇటో ॥ఎగిరి॥

ఎక్కడికమ్మా ఈ పయనం
ఎందుకు నీకీ సంతోషం
కన్నెవయసులో ఒంటరియాత్ర
కత్తిమీద పెనుసాము కద ॥ఎగిరి॥

విశాలమైనది ఈ జగతి – కానీ
విడిగా మనునా ఆడది
కమ్మేను చుట్టూ చీకటి
అమ్మా అమ్మా అమ్మా నీ గతి ఏమిటి. ॥ఎగిరి॥

**3**

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

ఓహో అందమంతా నా సొమ్మే
అయినా నేను మాత్రం నీ సొమ్మే
లలాలుం.. లలలాలుం – ఓహో

అద్దంలో నీ రూపే
నా నిద్దురలో నీ తలపే
వలదని వీడినా వడలిలోనే నా వలపే
కలవరింతలు నీ కొరకే ॥అద్దం॥

ఓహో – ఒళ్ళంతా మిసమిసలే
నీ గుండెల్లో గుసగుసలే
ఊరించే పెదవులతో ఆడవోయి ఊసులే
పండించు – నా ఆశలే. ॥అద్దం॥

# దోపిడిదొంగలు-1968

కృష్ణసాయి ప్రొడక్షన్స్ సంగీతం : కె. వి. మహదేవన్

**1**

పాడినవారు: పి. సుశీల

నా యవ్వనం ఈనాడే
నవ్వుచు పొంగారి
మేనిసొగసు పిల్లవలపు
కోరిన సుఖాల - కరగాలి కరగాలి కరగాలి ॥నా॥

పొంకపు తళుకుల కులుకుతుంది
ముచ్చట గొలిపే వయసుంది
అదిరే పెదవుల నవ్వుంది
హృదయం పాటలు పాడింది ॥నా॥

తుంటరి గాలి తాకెనమ్మా
కొంటె కోయిల కూసెనమ్మా
వలపుల పూవులు విరబూచి
ఎదలో ఊహలు రేగెనమ్మా. ॥నా॥

**2**

పాడినవారు: పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

తళకు బెళుకులు - మురిపెం - ఇది
తళ తళలాడే పరువం - మన
ఇరువురిలో అనురాగం - అది
ఎన్నిటికీ సల్లాపం ॥త॥

గల గలలు నదికే సొంతం
గానాలు ఎందరికి సొంతం
ధగ ధగలు జాబిలికి సొంతం
నిగ నిగలు – నీకు సొంతం ||తే||

మనసుకు కూరిమి సొంతం
మదికూడా నీకే సొంతం
వయసుకు వలపే సొంతం
వలపులు నీకే సొంతం ||తే||

పూచింది వేచిన కన్ను
పూవల్లె మనసే ఆడె
కాది వెన్నెల పగలే
కనువిందు – నేనే. ||తే||

విరజాజి వన్నెలు వలచి
విరితేనె పొందితి నేనే
సౌఖ్యాల వాహినిలోన
స్వర్గాన్ని చేర్చు నేడే. ||తే||

**3**

**పాడినవారు: ఘంటసాల**

బొంది ఇచ్చినోళ్లు మనకు ఇరువురన్నా – ఆడ
మోసుకొచ్చి పోయినోళ్లు నలుగురన్నా

ఉన్ననాడు చుట్టూ గుమిగూడువాళ్లు – జీవి
గూడు విడిచిపోవ ఏల తోడురారు?

తీరనట్టి రోగాలకు తీర్పుయిచ్చి – వాడు
తీరైన వైద్యాన్ని తేటపరిచి – పరిచె – ముగిసె
పరరోగాలకు వైద్యుడై తన రోగానికి మారకమై
పక్కపరచి గుర్రుని లిపె – జీవుడు
రెక్కవిప్పి ఆట నిలిపె. ||బొం||

జ్యోతిషం లెక్కలెన్నో తా చదివె - శుభ
కార్యాలను చేయుటకు తిథులు వెదికె
చేయిచూచు జోస్యునకు -
దరిచూపు చావువచ్చి -
తిథినిపెట్టి వెళ్లెనయ్యో - తేదీ
పలకమీద మిగిలెనయ్యో. ||బొం||

పట్టణాన పదవుల్లో వాడు మెరిగె - అహ
పట్టరాని అధికారపు మత్తు కలిగి - కలిగి ములిగె
ఎన్నో గట్టి గట్టి ప్లాన్లు వేసి కట్టడాలు కట్టుకొని
చిట్టచివర పక్కపరిచె - మన్ను
కొట్టినోడె - పదవి గెలిచె. ||బొం||

## 4

పాడినవారు: పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

ఎన్నెన్నో ఎన్నెన్నో అందాలు ఊరించును
సుధలెన్నో చిలికించి ఇంపార కురికించును

చేమంతి పూబోడి మొలకెత్తి వికసించుము
చెలరేగి అలరారి నాతోడ పులకించుము

మారని పచ్చని వలపు మనసుకు చల్లని తళుకు
కోరిన వెచ్చెలి తలపు కొనుమదె సుఖముగా చెలుడా

కమ్మని చెక్కిలి నునుపు కరగని పెదవుల ఎరుపు
చక్కని మిలమిల మెరుపు నా సరసనె వుంచుము చెలియ

వలచిన ప్రేయసి వధువు కనువిందుల మురిపెం మధువు
వెలిగెదలే నిరంతరం - నీ మెడలో దండగ చెలుడా

ఒంపులు సొంపులు స్వొంతం
పలు నోముల పంటలఫలితం
వాడని కులుకులె వరము
ఆ వరములు ఒసగుము చెలుడా. ||ఎన్నెన్నో||

**5**

పాడినవారు: పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

ముచ్చటలాడీ ఆడీ మోముదాచ న్యాయమా
పులకించువేళ పోకుమా – ఒక్క
చిటికేసి కోపం తీర్చుమా

కళ్లార మేలమాడి కవిత అల్లవా
కలలోన అల్లినట్టి కధలు పలకవా
గులాబి మొగ్గలిపుడు చిదిమిపోయనా
చలాకి వన్నెతోడ చెలిమి పెంచవా

అందాలు కోరుకున్న మనసు చూడుమా
మనసులోన పొంగుచున్న ఆశ చూడుమా
పిల్లమదిని సిగ్గుసిరులు కొల్లగొట్టుమా
పల్లవించి ఆటలాడి వలపు కూర్చుమా.

★ ★ ★

# రాము-1968

ఎ. వి. ఎమ్. ప్రొడక్షన్స్ సంగీతం : ఆర్. గోవర్ధనం

పాడినవారు: పి. సుశీల

పచ్చని చెట్టూ ఒకటీ
వెచ్చని చిలకలు రెండూ
పాటలు పాడీ జోకొట్టాలి జోజోజో ||ప||

చల్లని పలుకుల తల్లీ – చక్కని నవ్వుల తండ్రీ
కమ్మని నోముల పంటా – నేనె సుమా ||ప||

ఇద్దరి బుగ్గలమీద – ముద్దుల మూటలు కడితే
ఇంపుగ నిదురపోవాలి – జోజోజో ||ప||

చిట్టిచిలక పలక చిలకతల్లి కులక
చిలకరాజు చెట్టుచాటున వెతకాలీ
చల్లగ మురిసేవేళా చాటుగ మసిలే వేళా
ఎల్లరు కళకళలాడాలీ ||ప||

పచ్చని చెట్టూ ఒకటీ – వెచ్చని చిలుకలు రెండూ
పాటలు పాడీ జోకొట్టాలి జోజోజో. ||ప||

* * *

# అత్తగారు కొత్తకోడలు-1968

కల్పనాచిత్ర　　　　　　　　　　　　　　సంగీతం : జి. కె. వెంకటేష్

పాడినవారు: పి. బి. శ్రీనివాస్, ఎస్. జానకి

నువ్వు లేనిదే పువ్వు పువ్వు కాదు
నేను లేనిదే నువ్వు నువ్వు కాదు

నువ్వు లేనిదే నవ్వు నవ్వు కాదు
నువ్వు లేనిదే నిండు వలపు లేదు ॥ను॥

నువ్వుంటేనే మల్లెలు పరిమళం
లేకుంటే అవికావు కోమలం

నువ్వుంటేనే వెన్నెల చల్లదనం
లేకుంటే అవికావు కోమలం. ॥ను॥

వెలుగుంటేనే నీడల జాడలు
వెల్లువలోనే నీటికి వేగం

మనసుంటేనే మమతల విరులు
మమతలవలనే జగతిని మధురం ॥ను॥

నువ్వుంటేనే ఈ భువి నందనం
లేకుంటే దారిలేని కాననం

నువ్వుంటేనే ఆశకు ప్రాణం
లేకుంటే – ఏదీ లేదు. ॥ను॥

**2**

**పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి, ఎ. ఎం. రాజా**

ఘాటు ఘాటు ప్రేమ ఎడబాటులాయనే
లేత లేత మనసు కత్తికోతలాయెనే

కటకటా కన్నీరే కడవ నిండినే
ఆ కడవకూడా మనసులాగ పగిలిపోయెనే ||ఘా||

ఆకుచాటు పిందెలాగ అమ్మచాటు పిల్లా
చీకటాయె పట్టపగలు జీవితమొక డొల్ల

కాకిచేతనైన ఒక కబురు పంపవా
మేక సందేశమైన నాకు పంపవా. ||ఘా||

తండ్రిమాట దాటలేని రాముడైనను
ఆలితో అడవులకు పోయి పొందెను

కడగళ్లకోసమే కట్టావా తాళి
పడరాని బాధలతో బ్రతుకే ఎగతాళి ||ఘా||

స్వంత ఇల్లే అయినది బందిఖానా
చింతలతో చేదాయె వలపుతేనే

రేగుతున్న గుండెమంట ఆరిపోవదా
ఏ దేవుడైన కనికరించి దారి చూపడా. ||ఘా||

* * *

# నేనంటే నేనే-1968

సుజాతా ఫిలిమ్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

ఒకే ఒక గులాబిపై వాలిన తుమ్మెద లెన్నెన్నో
ఒకే ఒక కోరిక రేపిన వింతలు ఎన్నెన్నో
క్వాక్ – క్వాక – క్వాక్

సిరికోరి ననుచేరి తెరచాటున
చెలికాడు ఆడేను దోబూచులే

కన్నులకు తెలియనిది కమ్మనిమనసుకు తెలియునులే
అల్లరిలో ఆటలలో చల్లనిమనసే దాగెనులే

కోనేట కలహంస ఎటు ఈదినా
తీరాన నాచెంత చేరాలిలే

తళతళలు దక్కవులే దారినపోయే దానయ్యా
వెలలేని మక్కువలు నోచినవానికి ధనమయ్యా.

★ ★ ★

# మంచిమిత్రులు-1968

మధు పిక్చర్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

ఓరచూపులు చూడకముందే
ఒళ్లు ఎందుకే ఝల్లుమనె

చేత్తో ఇలాగ తాకకముందే
చెక్కిలి ఎందుకే ఎర్రబడె ॥ఓ॥

చేరదీసి – చేసే చేష్టలు – తెలిసిన చెక్కిలి చెమరించె
ఎర్రని పెదిమలు ఎర్రని బుగ్గలు ఏకం అవునని పులకించె

పండుగచేసే పరువాలెందుకు – పైటచాటున దాగినవి
దాగుడుమూతలు ఆడుటవలనే మూగకోరికలు పెరిగినవి

వీలో రేగిన చిలిపి వూహలు – నాలో ఎందుకు పొంగినవి
నేనూ నువ్వూ ఒకటే కనుక మేనులు కలిసి కరిగినవి. ॥ఓ॥

వవనవలాడే నవ్వులు ఏమని చెవులో గుసగుసలాడినవి
ముద్దులమూటలు కట్టేమదిలో – కొద్దిగ చోటు అడిగినవి

తామర కన్నులు కోమలి ఆశలు తనువునేల పెనవేసినవి
తనివితీర చెలికాని మోవిపై తన్మయమధువులగ్రోలమని. ॥ఓ॥

## 2

### పాడినవారు: పి. సుశీల

అరె నిషా నిషా మజా మజా నీకు కావాలా?
దిల్ ఖుషీ ఖుషీ పదే పదే తనివి తీరాలా
వెచ్చని సరసాలు విడని మైకాలు
ఇచ్చే జవరాలు నీకు కావాలా? ॥అరె నిషా॥

వేసే చుక్కయితే ఎందాక వుంటుంది
తెల తెలవారగానే దిగిపోతుంది

చక్కని చుక్కయితే చల్లని తిమ్మిరి
నీతో కలకాలం నెలకొంటుంది.

అది బొటాబొటి సంతోషం. ఇది సరాసరి స్వర్గం
పానీయం కావాలా? పడుచుపిల్ల కావాలా? ॥అరె నిషా॥

చక్కని మైకాలు చిందులు వేయించి
చేయరాని పనులెన్నో చేయిస్తాయి

కమ్మని మనిషైతే కన్నులకు విందుగా
కవితలు నీచేత పలికిస్తుంది

అది ముఖాముఖి – సరసం – ఇది ఏకాఏకి మధురం
మత్తుమందు కావాలా? మగువపొందు కావాలా? ॥అరె నిషా॥

* * *

# పంతాలు పట్టింపులు-1968

శ్రీ శంభూ ఫిలిమ్స్ సంగీతం : పెండ్యాల

పాడినవారు: ఎస్. జానకి, ఎల్. ఆర్. ఈశ్వరి, గోపాలం

ఓయ్ విన్నే విన్నే
విన్నే నేను మెచ్చుకున్నా - చక్కనివాడా
ఓహోహో - నీకే నన్ను ఇచ్చుకుంటా చుక్కలరాజా
నేనే తాంబూలం - వయసే కవటాకు
సొగసే సున్నమురా - చెక్కిలి వక్కసుమా
నేను నోటిలో పండిపోతాను
పండి నీ గుండెలో నిండిపోతాను
నీ పెదవిమీద ఎర్రగా నీ గొంతులోన వర్రగా
నీ సందిట్లో వెచ్చగా పులకరిస్తాను ॥విన్నే॥

కళాదేవతకి కర్పూర తాంబూలం
జనావళి రంజనే మనసుకు ఆలవాలం

ఓయ్ విన్నే విన్నే మెచ్చుకున్నాను చక్కనివాడా
నేనే సుమహారం - మనసే మందారం
సొగసే చామంతి - వయసే సంపంగి
వలపు నీకొరకె మొగ్గ తొడిగెనోయ్
కులుకు నినుచూసి సిగ్గుచెందెనోయ్
నీ మెడ చుట్టూ ఒత్తుగా నీ వడిలోన మత్తుగా
నీ గుండెల్లో కొత్తగా సోలిపోతానోయ్
ఓయ్.... విన్నే విన్నే

కళాదేవతకి కమనీయ సుమహారం
జనావళికి రంజనే మన గమ్యానికి తీరం
ప్రజలే మనదైవం – కళయే సౌందర్యం
ప్రగతీవికాసమే – జీవిత పరమార్థం.

**2**

పాడినవారు: గోపాలం, ఎస్. జానకి, ఎల్. ఆర్. ఈశ్వరి

రమ్మంటె రాడు పెద్ద సోగ్గాడడో సోగ్గాడు
రమ్మంటే రాడు పెద్ద సోగ్గాడడో సొగ్గాడు
రంగేళి నంటాడు సోగ్గాడు
పట్టి కంగారుపడతాడు సోగ్గాడు ॥ర॥

ఈదులన్ని కాస్తాడు సోగ్గాడు
ఈలవేసి నక్కుతాడు సోగ్గాడు
ఊసులాడబోయి ఆ పిల్లగాడు – బలె
ఉబలాటపడతాడు సోగ్గాడు ॥ర॥

సిటికేసి పిలుస్తాడు షోరగాడు – కళ్ల
సిట్లించి సూస్తాడు పోరగాడు
సెంగుతాకితే చాలు సక్కనోడు – ఒళ్లు
సెమటబోసి ఒణుకుతాడు సోగ్గాడు ॥ర॥

అహ – నడుము సిన్నది – నాజూకైనది
నా రాణి అంటాడు సోగ్గాడు
ఊరవతలపిల్ల ఊరించితే
అయ్యో ఉలకడు పలకడు పోగ్గాడు ॥ర॥

సెంటు పూసుకొస్తాడు పిలకరాజు
జంటకూడమంటాడు జమిందారు
తాళికట్టమంటె 'అదరును రాజు
తనదారి చూసుకుంటాడు సోగ్గాడు ॥ర॥

* * *

# పేదరాసి పెద్దమ్మకథ-1968

పి. ఎస్. ఆర్ పిక్చర్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

ఇదియే అందాల మానవ సీమా
ఇలయే ప్రేమికుల మురిపాల సీమా
ఇదియే లావణ్య జీవన మహిమా
ఇచటే పండునులే ఎనలేని ప్రేమా ॥ఇది॥

విరిసే సొగసులతో నిదురించే సెలయేరు
సెలయేటి వెన్నెలపై పులకించే హృదయాలు

శిలలైనా వలపులతో చిగిరించే కోనా
కమనీయం రమణీయం కమ్మని దీవన ॥ఇది॥

ఆశలు హంసలై విహరించే దీవి
అలలాగ పడిలేచే అందాల తనివీ

పైరగాలి కెరటాల పయనించే గీతం
ఎదవుంటే భూలోకం ఎంతో మోహనం

ఇచటే పండునులే ఎనలేని ప్రేమా
ఇదియే అందాల మానవ సీమా.

* * *

# రణభేరి-1968

పి. ఎస్. ఆర్. పిక్చర్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: ఎస్. జానకి

ఇది కూడదురా మదమెందుకురా
చెలరేగకురా చినవాడా
జవరాలనురా సుకుమారినిరా
అవమానము చేయకు మగరాయా ||ఇది||

స్త్రీలను పూజించేచోట దేవతలే నివసింతురట
పడుచుపిల్ల వుసూరుమంటే బడబాగ్నులు రగులునురా

నా అందాలలో కోటి సుధలున్ననూ
ఈ రససుందరే నీ విషబిందువు
ఇల కీచకులు రావణులు కడతేరురా ||ఇది||

కలికాలం అనగా పాపం కనులార కాంచుటేనా
అకటా అని జాలిచూపి ఒకరైనా ముందుకి రారా

కామానికి కళ్లెంలేదా పాపాలకు పగ్గంలేదా
పీడించే క్రూరుని వారించే వీరుడే
కరుణించే వేలుపురీతి కాపాడరాడా. ||ఇది||

## 2

### పాడినవారు: ఎస్. జానకి

చాలదోయి చాలదోయి ఈ హోయి
జ్వలించే జ్వాలనోయి మధుపాయీ
ఇంక విషమైన రసమైన ఒకటేనులే
సరదాలు కొరడాల కొసలేనులే ॥చా॥

పగబట్టి నా సొగసు పామైనది – రాజా ఓ రాజా
పచ్చని వలపులు వెచ్చని తలపులు పడగే విప్పినవి
ఆరని మోహము తీరని దాహము మోడే చేసినవి
ఇది నేనా అది నీవా – ఇది కైపా మైమరపా ॥చా॥

ఒకనాడు కోరిన చెలిమి – ఈనాడు ఉరుమై ఉరిమి
అరుదైన నా వలపు పిడుగైనది – రాజా ఓ రాజా

మదిలో సలసలమరిగే మమతలె ఒలికే పానీయం
కన్నుల జలజల కురిసే చినుకుల బాధే ఆనందం. ॥చా॥

★ ★ ★

# భార్య-1968

కౌముది ఫిలిమ్స్ సంగీతం : మాస్టర్ వేణు

పాడినవారు: ఎస్. జానకి, బృందం

ఇంటికంటె గుడిపదిలం
ఇది విలాసాల నిలయం
రేయిపగలు సంబరం
హోయిహోయి ముమ్మరం
వలపు కలిసినా బలే ముచ్చటా
చిక్కులన్నవే – లేవు ఇచ్చటా చుక్క చుక్క
చుక్కలాగా దిగివచ్చి చక్కదనం చవిచూసి
అంతటితో ఆగమంటే వలదు కలవరం. ॥ఇ॥

మనసు కలిగితే దాచిపెట్టకు
ఆశ పెరిగితే – అణచివేయకు – దొంగ దొంగ
దొంగ చూపులు చూడవద్దు
దోచకోయి లేతసిగ్గు
దోరవయసు రమ్మంటే వలదు కలవరం. ॥ఇ॥

పడుచుగుండెకు పగ్గమెందుకు
పరువమంతయు పిలిచె విందుకు – వేడివేడి
వేడివేడి సరాగాలు వేడుకైన తాయిలాలు
చూపులతో ఆరగించు – తీపి యవ్వనం. ॥ఇ॥

* * *

# చెల్లెలి కోసం-1968

జయశ్రీలక్ష్మీ పిక్చర్స్ — సంగీతం : టి. చలపతిరావు

**పాడినవారు: ఎస్. జానకి, టి. ఆర్. జయదేవ్**

నవ్వాలి నువ్వు పకపక
ఆడాలి నువ్వు చకచక
నాలో ఏదో నవనవ
నీలో ఏదో కువకువ
ఆ నవనవ కువకువ – ఆగని జవజవ ॥న॥

పోలేవు నువ్వు పోనీను నేను
మురిపాలు వదులుకోలేను
సరసాలవేళ సంకెళ్ళు ఏల
చెలరేగెను కోరిక చాల!

అనుకోని సుఖము పిలిచింది నిన్ను
అందాలు దోచుకోవోయి
ఈనాటి హాయి వెలలేనిదోయి
తెలవారదు వలపుల రేయి.

**2**

**పాడినవారు: ఎస్. జానకి**

పిలిచా నిన్నే తలచానెన్నో
ఇలారా ఇలారా యిదిగో మాట
చక్కని చుక్కా టక్కరి చిలకా
ఎక్కడికే యీ పరుగు?

పదుచుదనాల పంజరమందే
పచ్చగా వెచ్చగా వుండు ||పి||

కోరినవాడే చేరినవేళ
కూరిమి మనసు తెలపాలంటే
పావురమల్లే ఎగరాలంటే
బావురుపిల్లులు బంధించాయి ||పి||

మాయలమారీ లోకంలోన
నాలుగువైపుల నక్కలున్నవి
అడుగు అడుగునా గోతులున్నవీ
దాటకలిగితే బాటలున్నవీ. ||పి||

* * *

# బంగారు పిచిక-1968

శ్రీగణేశ్ పిక్చర్స్ సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

ఓహోహో బంగారు పిచ్చికా
పలుకలేని పంచదార చిలకా
నువు పారిపోతున్నావు నిజము తెలియక ॥ఓ॥

నీ కంటిలోన కలవు కోటివజ్రాలు
నీ వంటి మెరుగుమించు మంచిముత్యాలు
నీ కులుకుముందు రతనాలే గులకరాళ్ళు
నిన్ను తిలకిస్తే కావాలి - వేయికళ్ళు ॥ఓ॥

నీ పెదవిముందు బలాదూరు పగడాలు
నీ కురులముందు దిగదుడుపు నీలాలు
నీ చెంపలకు తీసికట్టు కెంపులు
నీ ఒంపులే సొగసు సొటింపులు ॥ఓ॥

దాచుకోలేనివి ఈ సిరులు - అవి
దోచుకోలేరులే ఇంకెవరు
నీ సిరులు కోరువాడికి నీవు అందవు
నీ మరులుకోరితే - ఏమిటందువు
నీవు ఏమిటందువు
దపాసనిపద..... పదాపమగా....రిగారిస. ॥ఓ॥

## 2

### పాడినవారు: పి. సుశీల.

పో – పో – నిదురపో
నిదురవచ్చినా రాకున్నా నిదురపో – నురి
వెచ్చగా కలగంటూ నిదురపో ॥పో॥

పిల్లగాలి అల్లరిపెడితే
మల్లెపూలు మతిపోగొడితే
చిన్నచిన్న ఉబలాటాలూ
చెలగాటాలాడినగానీ ...... ॥పో॥

మేలుకొన్న సరదాలకు జోలపాట పాడుకో
తాళలేని తొందరకు లాలిపాట పాడుకో
తలపులలో నాటినది మొలకెత్తును రేపటికి
తనివితీరు ఆశలే చాలును ఘానాటికి. ॥పో॥

## 3

### పాడినవారు: పి. సుశీల.

ఏం చేసుకునేదింత వెన్నెల
ఎచట దాచుకోవాలి కంటి మిలమిల
అంటున్నది రాధ కృష్ణా ఆలకించు ఆ బాధ

కోరికలూ కూర్చోనీయవు పడుచుదనం పడుకోనీయదు
పాడుసిగ్గు నిలబడనీయదు ఎదలో వేడి నన్ను బ్రతకనీయదు
అంటున్నది రాధ కృష్ణా
ఆరగించు వలపు సుధా ఊఁ

పంచదార పందిరిలోన మంచువాన కురిసింది
మంచువాన చినుకులలో మనసంతా తడిసింది
గొడుగు పంచలేదురా చక్కనయ్య నీ
కడగంటి చూపుల్లో తలదాచుకోనీరా
అంటున్నది రాధ కృష్ణా వింటున్నావా కధ

మల్లెపూల పానుపుపైన - పల్లేరులు మొలచెనురా
పల్లేరుల మోటుదనానికి ఒళ్లంతా నొచ్చెరా
పడక కుదరలేదురా చక్కనయ్యా
గుండెల్లో రవ్వంత కొంగుపరచనీ
అంటున్నది రాధ కృష్ణా
రమ్మంటున్నదిరా.

**4**

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

మనసే గని - తరగని
తగ్గని గని - పనిలోపని తెలపని
ఇది తప్పని - పని
వలపనుమాటలోన ముందేవుంది - వల
కలవారి కావ్యంలో తొలిపలుకే - కల
వలలో పడితిని కలలే కంటిని
కలలో నవాబైతిని ॥మనసే॥

నవ్వగా మోములోన దొరుకుతుంది - నగా
తిన్నగ చూస్తేనే మెరుస్తుంది నగా
నగలే దోచాను నగలే చూశాను
జగమే జిగేల్‌మన్నది - ॥మనసే॥

చెక్కెరమోవిలోన వేశానొక ఎర
చక్కని కౌగిలిలో - కలదు ఒక గిరి
ఎరకే పడినాను - గిరిగిరి కోరాను
కౌగిలి ఘెరావ్ చేసెను. ॥మనసే॥

★ ★ ★

# నడిమంత్రపుసిరి-1968

నవజ్యోతి పిక్చర్స్ సంగీతం : టి. చలపతిరావు

పాడినవారు: పి. సుశీల, పి. బి. శ్రీనివాస్

నీ చల్లని మనసు కమ్మని వలపు
ఎంతో ఎంతో హాయి సుమా

ఆ హాయిని మించిన తీయనిదేదో
నీలో నీలో వుంది సుమా

నీ కన్నులుచూసి వెన్నెలచూస్తే
వెన్నెల వేడి సుమా

నీ నవ్వులుచూసి పువ్వులుచూస్తే
పువ్వులు వాడె సుమా ॥నీ చల్లని॥

నీ అందంచూసి చంద్రునిచూస్తే
చంద్రుడు వెగటు సుమా

నీ మక్కువచూసి చక్కెర తింటే
చక్కెర చేదు సుమా ॥నీ చల్లని॥

నీ వంపులలోని సొంపులమించే
సొగసేలేదు సుమా

నీ మాటలకన్నా మైకముపెంచే
మధువే లేదు సుమా. ॥నీ చల్లని॥

★ ★ ★

# ఖడ్గవీరుడు-1968

గణేష్‌ప్రసాద్ మువీస్ సంగీతం : ఎస్. వి. వెంకట్రామన్

పాడినవారు: ఘంటసాల

సమానత్వమే ఎపుడు
అట్టి సన్మార్గం సరగున చేర్చును
రామరాజ్యమే వాంఛితమై
రమ్యం ధర్మం స్పందితమై
శాంతియు సౌఖ్యము కోరినదై ॥సమా॥

పోటీ వివాదం లేనట్టి ఒక
పుణ్యనవలోకం కుసుమించ
బుద్ధదేవుని బాటల జీవించ
మనం కన్న స్వప్నములు నిర్మించ ॥సమా॥

వర్గ భేదములు చాలించి
కలహాలు పగలూ విడనాడి
ఓర్మిబాటపై పోదామోయ్
ఒకే జాతిగా వుందామోయ్. ॥సమా॥

పాడినవారు: పి. సుశీల

మృదువైనవాడు ఒక వన్నెకాడు
కనువిందుచేసి వలపించునే
మది దోచువానికోసం భ్రమియింతునే
అనురాగమే నవభావమై నా కంట తోచునే ॥మృ॥

ఏనాడు లేనట్టి విధమాయె - నా
ఎడమకన్నదురును ఎదమీరె - ముద్దు
చెలియరో యిదియేమి బాధలో ముదమేమి
ఏదేదొ ఎంచును ఎద ఎటో సాగును
ఇది ఎంత చోద్యము. ॥మృ॥

**3**

**పాడినవారు: పి. బి. శ్రీనివాస్**

కన్నీరే మున్నీరై - తనవారే పగవారై
జాలిలేని లోకములో నేలపాలే అయినావా
అంతా విధిలీలా అమ్మా - అంతా విధిలీలా
విధియే పగబూనె బాబూ - విధియే పగబూనె ॥క॥

అనుమానాలే ఎదురాయె
కనికర మొకటే కరువాయె

కధలే వెతలై మనసే చెరువై
బ్రతుకే అయ్యో బరువాయె ॥విధియే॥

బలమూ తెలివీ కలవాడూ
తన భార్యను కానక విలపించు

గ్రహణములోన చిక్కిన సూర్యుడు
కాంతులుబాసీ కనిపించు ॥విధియే॥

నేరము చేయకపోయిననూ
నేలను రాలెను కోరికలు

ధూళిని కలిసెను కలలన్నీ
చూలాలివి అయ్యయ్యో తోడేది ॥విధియే॥

సూర్యోదయమై తీరునులే
శుభములు తప్పక కలుగునులే

## 4

### పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

అందముగా ముచ్చటగా హాయి చిలుకునే
చిన్నమోము కనుగొనినా కవిత పలుకునే
పాపపుట్ట విందుకూర్చు భాగ్యములేదు – తన
బంధుకోటి తొట్టినూపు వరములు లేవు
కూర్మితోడ కన్నతండ్రి సరసనులేడు
ఓరిమితో వెయ్యేళ్ళు వర్ధిలు నీవు ॥అం॥

ఊసులాడు నాదుచెవులు తేనెలూరును – నా
ఆశతీర మేను పొంగి ఎటో పోవును – నే
మనసు మరిచి మురిసి మురిసి కలలుగాంచును
పుత్రపాశముచే నా హృదయం ఆడిపాడును
రాచబిడ్డ దైన్యముగా నేలకరచెను
చూచి మిగుల ఎడద పగిలి కుమిలి వగచును
నవ్వులయే దుఃఖమందు మనసుకు మందా
తమితీర చిట్టిపాపే కనులకు విందు ॥అం॥

దారులు వేరై తపియించినను
ధర్మము చివరకు గెలుచునులే
నారు పోసినవాడు నీరు పోయునులే
నిజమేమిటో నిలకడపై తేలునులే.

## 5

### పాడినవారు: ఘంటసాల

పరువం పలకరించ – నీకు బిడియమా లేక
పడుచువాని నడతలపై దొంగకోపమా
వలపు పిలుపాలించి వాకిట నిలిచేవో వలపూ
వింతగాడ్పు నిన్ను వేచు విలాసినీ ఆగేవో – సాగేవో ॥పరువం॥

సరసకు పిలువరారాదో – దరికి రమ్మను పేరలకో
చెలి బిగువు కవ్వించి మైమరపు వెతగూర్చి

ఎద పరపు సఖి మరుని చిలుకో
మేను వినువీధి విహరించు మెరుపో
కాలిని గజ్జెలే ఘల్లు ఘల్లు అన
కళ్లు ఇదే మెరసి పెళ్లు పెళ్లు అన
మరుని వారువము నిన్నుపోల - అల
రారునే అమృతము వూరునే
చెలి వింత వలపులకు
నిలయమైన కళ వర్ణమో - లలిత చిహ్నమో.

**6**

**పాడినవారు: పి. సుశీల, ఘంటసాల**

వలపుల బాట కమ్మగపూచె
విరితావి చెలువయ్యై వీచె
హృదయం అందాల విరపూచి
అందు ఘుమఘుమలాడెడి తేనియ ఝరి పొంగి
చెలియ - ఒలికించె ॥వ॥

మనసు పొందుల వలపుందిలే మధుపూరమే జిమ్మిందిలే
మన వాక్యమే నెరవేర్చుమా
కనుపించుమా మురిపించుమా
ప్రియా చూడుము
నను కూడుము
చెలికూరిమి - సుఖమొందుదాం ॥వ॥

సొంపులతో మోహపుధార మదిని చెరువై పొంగిపారును
ప్రియుని హృదయజలధి చేర అలలే ఎంతో సంతసించు
నీదు కోర కోర చూపు కానుకేమి కోరును
నేనే నోచు కన్నెనోము కలలు నేడు కోరును
స్వప్నము చాలు
నా మనసే తరించు
ఎచటా?

**7**

### పాడినవారు: అప్పారావు, రాణి

తీరనిదాక సందేహం తీర్చు అమ్మణీ – అది
తీరకున్న బ్రతుకలేను పోవు నెమ్మదీ

వేదనలో ఈదనేల విషయమేమిటండీ
విశదంగా వివరిస్తా – తెలుసుకుని పొండి

అనురాగమంటే ఏమిటి కొంచెం బోధపర్చునువ్వు
కొంచెం బోధపర్చునువ్వు – అహ

అది కన్నులార ఆడామగా నవ్వుకొనే నవ్వు
ఎప్పుడు ఎప్పుడు – ఎప్పుడు
ఇప్పుడు ఇప్పుడు – ఇప్పుడు

కళ్యాణ మేమిటని వాడుక
పిల్లకంరానికి ముడివేసెడి....
ఓహో అటులనా – హు – ఇంకోటి ॥తీ॥

వలపు ఏర్పడేక కళ్యాణం జరుపుటా లేక
కళ్యాణం అయిన పిదప వలపు తెలుపుటా

ఇసుమంతయు తెలివిలేని ప్రశ్నలు
ఈ రెండు పనులీ జగాన జరుగుతున్నవే
ఓహో అటులనా ...కొంచెం ముందు
ఎవరేనా పెళ్ళాడుట ఎందుకంట – దాని
కారణాన్ని బోధించు చివరంటా

సంసారం పొందుచు సంసారం చేయుచు
సౌఖ్యంగా కులవృత్తిని చేయుటకే
బలె బలె అదామాట నాకు బోధపడదే ॥ఎ॥

మీ అక్కకింక సీమంతము జరుగునా – ఒక
ముద్దుబిడ్డ ఆర్నెల్లకు పుట్టబోవును
ఆశతీర మామా అనుచు పిలువబోవును
అప్పుడన్ని విషయాలూ తెలిసిపోవును ॥ఎ॥

అటులనా హాఁ హాఁ ఇంకోటి
ఇక తీరనిదాక సందేహం – అది
ఆడా మగా అని నే తెలుసుకుంది
అమ్మనడిగి ఏదో ఒకటి! ||తీ||

## 8

పాడినవారు: పి. సుశీల

సలాం సలాం హే షాహింషా
చిన్నది నటించు వన్నెలు ఫలించును
సలామత్ రహో అలంఅపనా అలంఅపనా
ఆశచేత ఆడు నాటకం అదే తమాషా

హై పాదుషా అదే తమాషా ||సలాం||

అందం ఒలికే వయ్యారి నిన్నే కోరునే
చిందువేసి చిన్నారి తేలిపోలునే
నిను పిలుచు సరాగాలు – వలపించు ముద్దరాలు
ఎదకలుపుమా సుఖియించుమా
ఇక జిల్ జిల్ – దోదిల్ ||అదే తమాషా||

మధువుగ్రోల మేనంతా మైకం చెందును
మారని స్నేహాలే పూచి పండును
ఎలపరువం సుఖంమీద – ఎదపొంగి తనివితీర
జవరాలిదే – మురిపించునే –
ఇక జిల్ జిల్ – దోదిల్. ||సలాం||

★ ★ ★

# వింతకాపురం-1968

పద్మశ్రీ పిక్చర్స్ సంగీతం : మాస్టర్ వేణు

**1**

**పాడినవారు: ఘంటసాల, పి. సుశీల, బృందం**

చూడు తడాఖా కాదు మజాకా నా దారికి లేదు ధోకా
చూడు తడాఖా కాదు మజాకా
మ్మె మ్మె మేకా
డొక్కుకారు దొరగారు టెక్కుచూపుతున్నారూ
నిక్కీ నీల్గీ పోటీకొస్తే చిక్కుల్లో పడతారూ
బహుచిక్కుల్లో పడతారు

కుర్రకారు దొరసాన్లు నేర్చారు ఫాషన్లూ
మగాళ్ల దుస్తులు ధరించగానే దువ్వలేరు మీసాలూ
ఆడదంటే నాజూకూ – ఆ పేరే పువ్వుల రేకూ
గయ్యాళిగా మారినప్పుడు – వెయ్యాలి ఒక బ్రేకు

చేతకాని మగవాడు – నీతిబోధ చేస్తాడూ
పాతకాలపు గొప్పకుపోతే భలేచిత్తు అవుతాడు
ఆకతాయిపిల్లోడా రాలుగాయి బుల్లోడా
ఆడవాళ్లతో డీడిక్కంటే – తింటావోయి ఖాజా
ఛ ఛ అప్ టు డేటు లేడీసు తగ్గుట ఎంతో నైసు
హద్దుమీరి చెలగాటమాడితే ఆట అంతతో క్లోజ్
బాకా బాకా బాకా.....మ్మె మ్మె మేకా.

★ ★ ★

# అసాధ్యుడు-1968

టైగర్ ప్రొడక్షన్స్ సంగీతం : టి. చలపతిరావు

**1**

**పాడినవారు: ఘంటసాల**

వెళ్ళగలిగితే వెళ్లు వెళ్లు వెళ్లు
నన్ను విడిచి కదలలేవులే — నీ కళ్లూ కాళ్లూ ॥వె॥

నమిలేసేలా చూడకు నీ చూపులే కందిపోతాయి
నాలో తాపం లేపకు నీ సిగ్గులే వాడిపోతాయి
నాతో నువ్వే పెనగకు — నీ సొగసు నలిగిపోతుంది. ॥వె॥

వలపుల సంకెల లాగకు — అది లాగితే బిగిసిపోతుంది
వెచ్చని కోరిక దాచకు — దాచినా అది బయటపడుతుంది
ఇంకా బింకం పెంచకు నా ఒళ్లు ఝల్లుమంటుంది ॥వె॥

తనువులు ఎంతో చేరువ — మన మనసులు దూరం చేయకు
తలపులు ఎంతో తీయన — అవి చేదూ వగరూ చేయకు
నువ్వూ నేనూ ఒక్కటే — ఆ సంగతి మాత్రం మరువకు. ॥వె॥

## 2

పాడినవారు: మాధవపెద్ది, ఎల్. ఆర్. ఈశ్వరి, బృందం

సైరాజా నారాజా హుషార్ – హుషార్
నిద్రలే – లేవరా హోషియార్
శుభాకాంక్షలు తెలిపే మిత్రులు
ప్రమాదాలలో తోసే శత్రులు
రెండు వైపులా నిండివుండెరా ॥సై॥

తెల్లనివన్నీ పాలు కాదురా
నల్లనివన్నీ నీళ్లు కాదురా
పైన మెరుగులే పసిడి కాదురా ॥సై॥

తేనె పూసిన కత్తులున్నవి
చేను మేసిన కంచెలున్నవి
వెన్ను పొడవగా వేచియుండెరా ॥సై॥

నీవు చేసిన పుణ్యమన్నదే
నిన్ను కాచెడి నేస్తమగునురా
బ్రతికి నూరేళ్లు సుఖమునందరా. ॥సై॥

* * *

# మర్మయోగి-1968

జూపిటర్ పిక్చర్స్ సంగీతం : ఘంటసాల

పాడినవారు: పి. సుశీల

తీయనైన హృదయం
తేనెలూరు సమయం
చూడగానె విడిచిపోయె
లేనిపోని బిడియం ॥తీ॥

కళలు మెచ్చే దొరలేకదా
కలిమి మగసిరి నీదేనటా – హాయ్
పటిమజూపి నటనమాడే
పడతి మనసూ నీదేనటా – హాయ్ ॥తీ॥

రసికతెంతో విన్నానులే
మిసిమి సొగసు కన్నానులే – హాయ్
విందుచేసే అందమింక
విడిచి మరలీ పోలేనులే – హాయ్ – ॥తీ॥

పాడినవారు: జమునారాణి, ఎ. పి. కోమలి

మధువుమనకేల సఖియరో
మరిచిపొమ్మా కమ్మకమ్మని
జవరాల రమ్మా రా – రమ్మా

విందుకు పిలిచితి వోరాజా
అందాల పొందు వేరెందులకో ॥ఎందులకో॥

తీపి సొగసుల సింగారమే పసందు
నేడు చేయాలి మోవి తేనియల విందు – హోయ్

మందారగంధమ్ముతో
మైపూత పూయుటకో
మరుమల్లె మమతలమది
ఉయ్యాల యూగుటకో ||ఎందులకీ||

మేలి సరసాల జలసాల తేలవోయీ
ఊం ఊం అహహ – హోయి
హోయి చేతికందె వృథా చేయకోయి
ఇంతి సరసకు చేరగానే – ఇటుల పెడమోమగుటకా
పండువెన్నెల పరువమంతా దండుగౌనరించేందునే ||ఎందులకీ||

తాపమంది మేను తహతహలాడేను
జాలమేల బాలిసైపలేను
కలిసి జలకములాడి కలికిని – వలచికులికేటందుకే
చెలిమి చెక్కిలి చేతనిమురుచు – చిటికె వేసేటందుకే. ||ఎందులకీ||

3

పాడినవారు: పి. లీల

నవ్వుల నదిలో పువ్వుల పడవా కదిలే
ఇది మైమరపించే హోయి – ఇక రానేరాదీ రేయీ ||న||

అనుకోని సుఖము పిలిచేను
అనురాగ మధువు ఒలికేను
కొనగోటితో నిను తాకితే
పులకించవలయు నీ మేను ||న||

నిదురించవోయి ఒడిలోన
నిను వలచెనోయి నెరజాణా
అరచేతిలో వైకుంఠమూ
దొరికేను నీకు నిముషాన ఆహహా. ||న||

**4**

**పాడినవారు: పి. సుశీల**

చోద్యం చూశావా ఓ
చుక్కల నెలరాజా ॥చో॥

అనగనగా ఒక అమ్మాయి
ఆమెకు వలపులు కలిగాయి
అయినా తెలియదు అబ్బాయి ॥చో॥

పగటి వేషమేయువాడు
బలే మంచి చిన్నవాడు
వగలమారి సరసకు చేర
ఓరకంట చూడలేదు
సొగసుగత్తెను దూరంచేసే
చురకత్తినే చేపడతాడు ॥చో॥

అందగాడు చక్కని రూపూ
అయ్యోరామ దాచేస్తాడూ
ఆడపిల్ల మెచ్చే సొగసూ
అడవిపాలు గావిస్తాడు
అపురూపంగా అతివ మనస్సు
అల్లన మెల్లన లాలిస్తాడు. ॥చో॥

**పాడినవారు: జమునారాణి**

కడగంటి చూపుతో కవ్వించి కవ్వించి
వింత చక్కిలిగింత పెట్టవలయు
కొంగు లీలగ వీచి కొసరు వన్నెలతోడ
వాడి కొమ్ములు పట్టి వంచవలయు
ఒయ్యార మొలకించి ఒక్కంత మురిపించి
ఒంపు సొంపుల తనియింపవలయు

తనువు మెల్లగ సోకి తహతహలాడించి
అది అందక హాస్యములాడవలయు

ఆశపెట్టుచు చెలగాట మాడియాడి
చెలగ ఉక్కిరి బిక్కిరిసేయవలయు
చెవులు పట్టుకు ఆడించి చిత్తుచేసి
చెలుని దాసోహమని పంపవలయు - తరుణీ!
మనిపించవలయు తరుణీ!

## 6

**పాడినవారు: ఘంటసాల, జమునారాణి**

రావాలి రావాలి రమ్మంటే రావాలి
రకరకాల రసికతలెన్నో రాణిగారు తేవాలి

ఆగాలి ఆగాలి ఆగమంటె ఆగాలి
ఆలుమగలు అయ్యేదాకా అయ్యగారు ఆగాలి ||రా||

మదిలోన నేను మనువాడినాను - మరి జాలమేల
ఆ మనసులోనే అరుదైన హాయి ఊహించుకోవోయి
ఊహలోనికైనా నువ్వు ఓదార్పురావే
మగవారలయ్యో మది తెలుసుకోరు - తమ మాట తమదే
ఈ ఆడువారు ఎవరైన యింతే మురిపించి రారు
ఒక్కసారి వచ్చిన వనిత మరల వీడిపోదు ||రా||

సరదాలపైన చన్నీళ్లుజల్లా మరియాదకాదే
పగ్గాలులేని ప్రణయాలలోన - సొగసేమిలేదోయ్
సోగకంటి సైగలు తెలిసే - శోధించరాదే
ఆహాహాఁ..... ||రా||

**7**

**పాడినవారు: ఘంటసాల, పి. సుశీల**

పాలోయమ్మ పాలు – పాలోయమ్మ పాలు
కమ్మని గుమ్మపాలు – మీరు గుమ్మయిపోయే పాలు
ఈ పాలు గోలుమాలు ॥పా॥

గోకులములో గొల్లభామలు – పాలుపెరుగులు దాచా
కొంటెకృష్ణుడు స్నేహితులతో – పొంచి దానిని చూచే

ఇంటివారల కన్నుకప్పి – ఏమూలో దాచినవన్నీ
క్షేమంగా దాటించెనటా – దద్దోద్దో – కింతకత్తై ॥పా॥

బాలకృష్ణుని తల్లితండ్రుల మామ బందీ చేసెనే
పాలుపెరుగులు ఆరగించిన – బలము కృష్ణుడు చూపె

కటిక కంసుని దుంపతెంచి – కనుమూసి తెరచేలోగా
తనవారిని విడిపించెనటా. ॥పా॥

* * *

# మన సంసారం-1968

శ్రీకాంత్ ప్రొడక్షన్స్ సంగీతం : టి. వి. రాజు

**1**

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి, పి. బి. శ్రీనివాస్

ఓ గాయపడిన ప్రేమికా
తీయనైన కన్యకా
ప్రేమగాయము నయము చేసే
పిల్లమనసే కానుకా
పొంగి పారలే జీవనదికి అడ్డమన్నది లేదులే
పెద్దలందరు అడ్డుపడినా
ప్రేమికులదే విజయమోయ్ ॥ఓ గాయ॥

గుమ గుమ లాడే గులాబీ
గుండెలు కోసే కరారీ
టక్కున చేతికి చిక్కకపోతే
ట్రయ్ ట్రయ్ ట్రయ్ ఎగైన్ ॥ఓ గాయ॥

సిగ్గులు మొగ్గలు దోచేస్తా
బుగ్గల ఎరుపులు లాలిస్తా
హుషారు చేసి ఊరిస్తా
నిషాల మునిగి మురణేస్తా
ఓ ప్యార్ ట్రై.....
ముదిరిన రోగం కుదిరిస్తే
మురిపము దీరా ప్రేమిస్తా. ॥ఓ గాయ॥

★ ★ ★

# కోడలుపిల్ల-1968

జయశంకర్ అండ్ కంపెనీ సంగీతం : జి. కె. వెంకటేష్

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

నన్ను తాకె నెవ్వరో ఎవ్వరో
యవ్వనాల పువ్వులో పువ్వులో
తడిమేను ఒణికింది చలిలో
ఒక పెనువేడి రగిలింది మదిలో ॥నన్ను॥

నింగి నుండి దేవత దిగెనో
పన్నీటి జల్లు చిలకరించెనో
చెలి పక్కనవుంటే - నే
పరవశమౌతా ॥నన్ను॥

ఈ చక్కనిచుక్క చెక్కిలినొక్కుట ఏమో కల ఏమో
దేవలోక సుధలు తెచ్చానో - ఆ
మధువు తాగితే - నా మనసు ఊగితే
ఈ మధుర మధుర మధుర
భావమేమో..... వలపే పో. ॥నన్ను॥

## 2

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి, ఎస్. పి. బాలసుబ్రమణ్యం, సత్యారావు

తండ్రినైనా ధర్మమ్ము కోసమై
తగవులాడ వలయు – తప్పుకాదు
గట్టి నీతికన్న చుట్టాలు లేరయా
విశ్వదాభిరామ వినురవేమా

తైతక్కలాడు – తర్వాత చూడు
నీ ఆట కట్టిస్తాము ఒకనాడు – చూడు
మా మాట చెల్లుతుంది ఆనాడు
చేసేము శపథం ఇక పడతాము భరతం

నీతులెన్నో చెప్పుతాడు
గోతులెన్నో తీస్తాడు
తాను తీసే గోతిలోన
తప్పకుండ పడతాడు
తల్లకిందులవుతాడు
చావుకేక వేస్తాడు ॥తైతక్క॥

చాటుమాటు వ్యవహారము
ధర్మదాతల అవతారము
నీ తప్పే నీ ముప్పు ఈ రోజే కనువిప్పు
నే బైటపెడతాను బండారం
బేరుమంటుం దవతారం
నీకు ఇదిగో శ్రీకారం ॥తైతక్క॥

మేడమీద దొరగారు
మిడిసి కింద పడతారు
అప్పుడు చూడు అయ్యగారు
ఆవగింజకు కొరగారు
ముప్పుతిప్పలు పడతారు
ముసుగు నెత్తి వేస్తారు. ॥తై తక్క॥

* * *

# ధర్మపత్ని-1969

రెడ్డి అండ్ కంపెనీ సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

**1**

**పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

నాడు నిన్ను చూశాను చిన్నవాడా
ఆనాటినుండి నిదురలేదు వన్నెకాడా
నా కళ్లముందు కొస్తావు – కవ్వించి పోతావు
అల్లరేల చేస్తావు అందగాడా ॥నాడు॥

నాడు నిన్ను చూశాను చిన్నదానా
ఆనాటినుండి వలచాను పిల్లదానా
నా కలలోనికి వస్తావు కౌగలించమంటావు
కులకమంటే అలకేల కుర్రదానా ॥నాడు॥

నీ మోము చూడకుంటే నేనింక నిలువలేనోయ్
నిను వీడజాలలేని నీడనైతినోయ్
ఆ అందాల నీడయే అద్దాలమేడగా చేస్తాను
అందులోనే – వింత వింత వింత కాపురం
అహహా... ఓహో ॥నాడు॥

నా ఓరచూపులలోనే వలపంతా దాచినాను
మది నువ్వు తోచగనే మరులు రేగేనోయి
ఏయ్ – నీ ప్రేమ తియ్యనా – నా ఆశ కమ్మనా
ఇద్దరమూ ఏకమైతే – ఎంతో వెచ్చనా. ॥నాడు॥

★ ★ ★

# మహాబలుడు-1969

భారతీ పిక్చర్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

## 1

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

ఏమో ఒప్పేలకుప్పా – నిను
ప్రేమిస్తే అది తప్పా
అలరించే జవరాలా – నీ
అందం దాచెదవేలా రావేలా ॥ఏ॥

ఓ విరిబోణి కులికే అలివేణీ
నీ వయ్యారాల తియ్యదనాలు చవిచూపవే
రేపు మనసార మనువాడుతానే
నేడు తమితీర పులకించనీవే ॥ఏ॥

నీ పరువాలు అవి నా మురిపాలు
నా బిగి కౌగిలిలో నీ సొగసంతా కరిగించవే
కులుకు బింకాలు – పొంకాలు దోచి
కోటి బాహువుల బంధించనీవే. ॥ఏ॥

**2**

**పాడినవారు: పి. సుశీల, రాజబాబు**

మగాడంటే మజావున్నా
అదోలాంటి భయం
సరాగాలూ విలాసాలూ
తెలియవో – ఈ నిజం ॥మగా॥

నే బాలను ఏ మెరుగను
నీ వంటే వుందిలే ప్రియం
ఈ నిగనిగ మేనూ నీకై దాచితిరా
ఈ కులుకుల గోమూ కొత్తగ నేర్చితిరా
నునుసిగ్గులా విరిమొగ్గను
నిన్నుచూసి అవుతా పరవశం ॥మగా॥

నీ ముసి ముసినవ్వులు గుసగుసలాడినచో
నా మిసమిసలన్నీ మేలములాడునురా
కొనగోటితో నను తాకితే
ఎదనిండా ఏదేదో సుఖం. ॥మగా॥

**3**

**పాడినవారు: పి. సుశీల, బృందం**

ఇక్కడే వున్నది – చక్కని చిన్నది రా రా రా
ఏటికీ ఎదురీదకూ

నదులన్నీ కలవాలి కడలిలోనె
ఎదవుంటే కరగాలి వలపులోనె ॥ఇ॥

కమలాన్ని భ్రమరము కలియుటలేదా
కలువకై నెలరాజు వెలుగుటలేదా

చిలుక గోరింకతో పలుకుటలేదా
కలికిని చెలికాడు కాదనరాదురా
జవరాలితోడ మేలమాడ జాలమేలరా ॥ఇ॥

లతకూన తరువును పెనవేయదా
లాలించితే హాయిలు చిగురించదా

జగతిలో ప్రణయమే సహజమురా
మగువకు మగవాడు మనసీయవలెరా
మురిపాలతోడ బాలతోడ తేలవేలరా. ||ఇ||

**4**

**పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల**

విశాల గగనంలో చందమామ
ప్రశాంత సమయంలో కలువలేమ
ఒడిలోన వాలితే - ఒకసారి కరిగితే - నేరమా ||వి||

వెన్నెలలో చిన్నెలలో తేనెలున్నవి
నా కన్నులనే గిన్నెలతో తాగమన్నవి

ఒలికే మధువూ - కొసరే వధువూ
రెండూ నీవే.... ఓ ||వి||

చుక్కలలో జాబిలిలా వెలుగుతావులే
నా చక్కదనం దొరలాగా ఏలుతావులే

తీరని తనివీ - మారే అలవీ
ఏదో గారడీ ... ఓ. ||వి||

★ ★ ★

# సత్తెకాలపు సత్తెయ్య-1969

ప్రసాద్ పిక్చర్స్ సంగీతం : ఎం. ఎస్. విశ్వనాధన్

**పాడినవారు: ఘంటసాల, పి. సుశీల**

నన్ను ఎవరో తాకిరి – కన్ను ఎవరో కలిపిరి
చూపులోనే ఆపలేని – మత్తుమందూ జల్లిరి

నన్ను ఎవరో చూసిరి – కన్నె మనసే దోచిరి
చూపులోనే ఆపలేనీ మత్తుమందూ జల్లిరి ॥న॥

ఆ బుగ్గల లేత సిగ్గు – నా కోసం పూచినదేమో
సిగ్గులన్నీ దోచుకుంది – తొలివలపే ఎంతో హాయి

ఆ మగసిరి యల్లరియంతా – నాకోసం దాగినదేమో
అందగాడు ఆశపెట్టె – సయ్యాటలు ఎంతో హాయి ॥న॥

ఆ నల్లని జడలో మల్లెలు – నాకోసం నవ్వినవేమో
మల్లెలాగ నేనుకూడా జడలోనే వుంటే హాయి

ఆ చల్లని కన్నుల కాంతి నాకోసం వెలిసినదేమో
కాంతిలాగా నేను కూడా ఆ కన్నుల విలచిన చాలు. ॥న॥

## 2

### పాడినవారు: పి. సుశీల, బృందం

పదహారేళ్ల వయసే వయసు – ఓ బుల్లెమ్మా
పండీపండని సొగసే నైసు – యే చిట్టెమ్మా
ఈ పరువంలో లేప్రాయంలో
చికూ చింతా లేనే లేవమ్మా
హాయ్ హాయ్ – హాయ్ – ॥ప॥

బొట్టు కాటుక జడలో పూలు
ముచ్చట గొలపాలి
కట్టిన గజ్జలు గాజులు చేతులు
గల గలలాడాలి ॥ప॥

అందం చందం చిందులు వేస్తే
ఆశల పొంగాలి
ఆశలు పొంగులు అల్లరి చేస్తే
హాయిగ వుండాలి ॥ప॥

వన్నెలు వెలిగే వలపుల సొంపులు
వలపులు దాచాలి
కన్నులలోనే కమ్మని బంగరు కలలే నింపాలి
చక్కెర కంటెను మిక్కిలి చక్కని తలపులు రావాలి
ఉక్కిరి బిక్కిరి యవ్వనమంతా ఊయల లూగాలి ॥ప॥

★ ★ ★

# ముహూర్తబలం-1969

ఎం. వి. ఆర్ పిక్చర్స్ సంగీతం : కె. వి మహదేవన్

**1**

పాడినవారు: పి. సుశీల

నీకు ఎంత మనసుందో నాకు తెలుసునోయ్
నాకు ఎంత గుబులుందో నీకు తెలియదోయ్
రా – రా రాజా – రాతిగుండెలవాడా ॥నీ॥

మెత్తగా తాకితే ఉంగరాల వేళ్లు
మత్తుగ వుండదా మాయదారి ఒళ్లు
నీ కోడె వయసులోనె వుంది కత్తికోత వేడి
కత్తిగోళ్ల వాడి రా – రా రాజ నీకు నాకు జోడి ॥నీ॥

ఓరగా చూడగా నోరు వూరుతుందోయ్
ఇద్దరు కూడితే యింపు పెరుగుతుందోయ్
ఇది ఆకుచాటు పిందెకాదు పచ్చికాయ గాదోయ్
చాకులాంటివాడా – రా నేనే రాజనిమ్మపండు ॥నీ॥

వెన్నెలా వున్నది వన్నెలాడి చూపే వెచ్చగా యివ్వరా వచ్చినట్టి కైపే
ఈ గువ్వపిట్ట కులుకుజూసి గుటక వేయువాడ – గుండె దోచుకోరా
సై సై – ఇక స్వర్గమేలరా. ॥నీ॥

## 2

### పాడినవారు: పి. సుశీల, బృందం

అమ్మలగన్న అమ్మలారా అక్షింతలు వేయండి వేయండి
హాస్యాలాడే ఆడబడుచులు అమ్మా కొంచెం ఆగండి ఆగండి
ఆగం ఆగం హాస్యాలాడక మానం – హాస్యాలాడక మానం
తలబిరుసు పెళ్లి కుమార్తె మెడలే వంచదట
అవ్వవ్వ! హవ్వవ్వ! సిగ్గూ బిడియం అసలే లేవుసుమా
తాళిని కట్టించి ముక్కుతాడు వెయ్యాలి
మొగుడే రావాలి – పొగరే తగ్గాలి. ॥అమ్మ॥

అసలైన మరదళ్లంటే అల్లరి బాజాలు
మురిపాల పరాచికాలు ముళ్ల రోజాలు
సందడి చేయాలి సరదా పండాలి
పందిట్లో అమ్మాయి భరతం పట్టాలి
అవును అవును – భరతం పట్టాలి ॥అమ్మ॥

గయ్యాళి నోటికి తాళం టక్కున వేయాలి
తీరైన బుగ్గలు చిదిమి దీపం పెట్టాలి
సిగ్గులు చిందాలి చిలిపిగ నవ్వాలి
అందాన్ని దిష్టితీసి హారతి యివ్వాలి
అవును అవును – హారతి ఇవ్వాలి. ॥అమ్మ॥

* * *

# అన్నదమ్ముల-1969

డి. బి. ఎన్. డీగా ఫిలిమ్స్ సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల, బృందం

నవ్వే ఓ చిలకమ్మా నీ నవ్వులు ఏలమ్మా
ఆ నటనలు చూడమ్మా లేజవరాలి నుడికించకమ్మా

ఎగిరే ఓ గోరింకా ఇటు చూడకు మావంక
నీ ఎత్తులు చాలింక మీ మగవారి మాటలే చౌక
పెళ్లంటే పిల్లకు ఉబలాటం
అపుడు మొగమాటం ఇపుడు ఆరాటం

ప్రేమను కోరే ఈ మగవారు – పెళ్లనగానే కంగారు
మూడు ముళ్లు వేయాలంటే – మూతి ముడుచుకుంటారు ॥న॥

అబ్బాయిగారి బండారం
ముందు వెటకారము – పిదప మమకారము
కోపములేనీ ఆడవారు – కోరచూపులె చూస్తారు
కొమ్ములెన్నో తిరిగినవాణ్ణి
కొంగుచివర కడతారు. ॥న॥

## 2

### పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

చూస్తే ఏముందోయ్ రాజా – జలసా
చేస్తేనేవుంది – ఉంది మజా మజా మజా
పక్కనుందీ – పొంకమైన పెంకిపిల్లా
పక్కనుండీ – వాలుతుందీ ॥చూస్తే॥

నీ పొందుకోరి భుజంమీద వాలుతుంది
చేతినిండ తీయనైన నిషా నిషా – వుంది – నువ్వు
చెలిమిచేస్తే తనివితీర నవ్వుతుంది
నవ్వుతుందీ – నవ్వుతుందీ. ॥చూస్తే॥

చేసుకున్నావూ – నీ ఒళ్లంత వేయికళ్లు
చేసుకున్నావూ –
తాగుతున్నావూ –
నా వయ్యారం కళ్లతోటి తాగుతున్నావు
మనసంతా అలా అలా నావైపే అలా అలా
లాగుతున్నదీ – నీ
మగసిరికన్నా వేరు – కోరనంది
కోరనంది – కోరనంది. ॥చూస్తే॥

★ ★ ★

# సిపాయి చిన్నయ్య-1969

సురేష్ మూవీస్ 　　　　　　　　　　　　　　సంగీతం : ఎం. ఎస్. విశ్వనాధన్

**పాడినవారు: ఘంటసాల**

నా జన్మభూమి ఎంత అందమైన దేశము
నా యిల్లు అందులోన కమ్మని ప్రదేశము
నాసామిరంగ హోయ్ - హోయ్ - నాసామిరంగా ॥నా॥

నడిచేదారిలో నవ్వేపువ్వులు - శాంతి
నాదాలతో ఎగిరే పిట్టలు
పచ్చనీ పంటలూ వెచ్చనీ జంటలూ
చల్లని జీవితం - ఇదే నవభారతం ॥నా॥

బతకాలందరూ దేశం కోసమే - దేశ
మంటేను మట్టికాదోయ్ - మనుష్యులే
స్వార్థమూ వంచనా లేనిదే పుణ్యము
త్యాగమూ రాగమూ మిళితమే ధన్యమూ. ॥నా॥

**పాడినవారు: ఘంటసాల, ఎల్. ఆర్. ఈశ్వరి**

అమ్మాయి ముద్దు తప్పా ఔరౌర నీకు సిగ్గా
ఊరించే ముద్దులోనే - ఉంటుంది పూలతేనె

అమ్మాయి ముద్దులైతే - కావాలి చాటుమాటే
ముద్దేమొ ముచ్చటైనా చూస్తారు ఎవ్వరైనా ॥అ॥

ఎవ్వరూ లేరులే - పిలిచినా రారులే
పెనిగినా అలిగినా లాభమూ లేదులే

దేవికా నిర్మలా బావనూ చూడరే
అంజలీ పద్మినీ అల్లరే ఆపరే. ॥అ॥

తేలింది నా మది అలా అలా
ఇలాగ అయితే ఎలా ఎలా

వచ్చిందా మైకం బలే బలే
వలపుల నిషా ఇదే ఇదే
ప్రేయసీ ప్రియులను మెచ్చునే లోకమూ
ఇద్దరూ ఇంపుగా కరుగు టే తన్మయం. ॥అ॥

**3**

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

ఒరె మావా – ఒరె మావా ఓఓయ్
ఒరె మామా ఏస్కోర చుక్క
తెచ్చిపోసేను సక్కని చుక్క
ఏసుకో ఏసుకో సుక్క ఏసుకోరా ॥ఒరె॥

అరె బావా ఒరె మావా
అరె బావా నంజుకోర ముక్క
అది నవిలేవు దాసినసెక్క
నంజుకో – నంజుకో – నంజుకోర ముక్క ॥ఒరె॥

ఈ రేత్తిరి సేయరా జలసా
హాయ్ ఎక్కాలి తగ్గని నిషా
ఏసే సుక్క కొరికే ముక్క
రెండూ కలిత్తే – వారెవ్వా
మేగాలలో ఊగాలిరా
తాగరా మల్లీ మల్లీ
ఈ కైపులో మైమరుపులో
యాదుంచుకోరా – పెళ్లి – అరె
మావా పోకిరి సూపులు నీవి – హై
పొగరూ వగరూ నాది ॥ఒరె॥

వేడీ చలవా తీపీ కారం
ఇద్దరిలోనా ఉన్నాయి
నీ కంటికి సోకైనదీ
నేనే నేనే కదా
రంగేళినీ సింగారినీ –
రంభా మేనక నవుతా ॥ఒరె॥

అహఁ పిల్లే కదరా కులాసా
అది కల్లుని మించిన నిషా
పిల్లా కల్లూ పెదిమలకొస్తే
అల్లీ బిల్లీ తమాషా
మందెందుకు మగరాయడా
అందం అగ్గిబరాటా
అందాలనూ తాగెయ్యరా
అప్పుడు సూడు మజాకా. ॥ఒరె॥

**4**

పాడినవారు: పి. సుశీల

నా రాజు నవ్వులు కనిపించి
ఈ రేయీ నన్ను పిలిచేయి
దూరాన నాకై నిలిచాయి
నే రాకపోతే చినబోతాయీ ॥నా॥

చీకటిలోపల వెలుగులు
మోడై చెట్టు చిగురులు
ఎండిన నదిలో అలలు
నా పండిన బంగరు కలలు ॥నా॥

ఎదలో దాచగ లేనిది
ఎవరికి తెలుపగ రానిది
లోకులు వింటే కలకలా
నా కాలికి వేయని సంకెల. ॥నా॥

★ ★ ★

# కర్పూర హారతి-1969

శ్రీకాంత్ ప్రొడక్షన్స్ సంగీతం : టి. వి. రాజు

**1**

**పాడినవారు: పి. సుశీల**

చక్కనిపాపా చల్లనిపాపా
పాలూ బువ్వా – పాలూ బువ్వా కావాలా
వెండిగిన్నెలో నీకు వేడిబువ్వతేనా
వెన్నమీగడ పంచదార గిన్నెలో కలిపేనా
ముద్దుల మూటకు వెచ్చని గోరుముద్దలు పెట్టేనా
చిట్టీ పొట్టీ బంగారు కొండ నువ్వేనా ॥చ॥

పుట్టినిల్లుదాటి నేను మెట్టలేదే ఇల్లు
చిట్టితండ్రికి నా చేతులతో తొట్టిని కట్టేనా
నవ్వులవాన పువ్వులపోన నువ్వే నా బాబూ
నువ్వూ నేనూ నువ్వూ నేనూ ఆడాలి. ॥చ॥

చిన్న బాబూ నీకు నేను అన్ని ఇవ్వగలను
కన్నతల్లి ప్రేమమాత్రం ఎక్కడ తెచ్చేది
కమ్మని మదిలో తీయని మమత కలిగే నీవల్ల
అమ్మలాంటి పిన్ని నీకు కావాలా. ॥చ॥

★ ★ ★

# బుద్ధిమంతుడు-1969

చిత్రకల్పన సంగీతం : కె. వి. మహాదేవన్

పాడినవారు: ఘంటసాల

హహ్వారే హవ్వా హైలెసో సోసో – దాని
యవ్వారం అంతా హైలేసో

పచ్చిమిరపకాయలాంటి పడుచుపిల్లరోయ్
దాని పరువానికి గరవానికి పగ్గమేయరో
వగలమారి చెప్పరాని పొగరుబోతురోయ్
వన్నెలాడి వుడుక్కుంటె పదలమోకురోయ్

ఇంటికెడితె నిన్ను చూసి నవ్వుతుందిరోయ్ – దాని
వెంటబడితె కంటబడితె కసురుతుందిరోయ్
టక్కరి టెక్కుల పిల్ల పడవ ఎక్కేరోయ్
టెక్కంతా ఎగిరిపోయి ఎక్కి ఎక్కి ఏడ్చేరోయ్

చూడబోతె అవ్వాయి చువ్వలాంటిదోయ్
కూడబోతె కులుకులాడి గువ్వలాంటిదోయ్
జాంపండులాంటి గుంట జట్టుకట్టరోయ్
జారిపోతే దారికాసి పట్టుపట్టరోయ్.

## 2

### పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

గట్టుమీద గువ్వపిట్ట కూసింది
కట్టమీద కౌజు పలికింది
గుడిలోన జేగంట మ్రోగింది
నా గుండెలోన తొలి వలపు పండింది ॥గ॥

నల్లానల్లని మబ్బు నడిచింది
తెల్లాతెల్లని అంచు తోచింది
చనువు జలరేకలై వెలిగింది
చల్లాచల్లాని జల్లు కురిసింది ॥గ॥

కొమ్మమీద వాలి గోరువంక
కమ్మకమ్మని ఊసులాడింది
గోరింక తానింక గూడు కట్టకపోతె
కొమ్మా ఎంతో చిన్నబోతుంది ॥గ॥

సన్నగాజుల రవళి పిలిచింది
సన్నజాజుల దండ వేచింది
మనసైన జవరాలే వలచింది
మనుగడే ఒక మలుపు తిరిగింది. ॥గ॥

**3**

పాడినవారు: ఘంటసాల

టాటా వీడుకోలు
గుడ్‌బై ఇంక సెలవు
తొలినాటి స్నేహితులారా
చెలరేగే కోరికలారా ॥టా॥

ప్రియురాలి వలపులకన్నా - నను
వెచ్చనిదేదీ లేదనీ
నిన్న నాకు తెలిసింది - ఒక
చిన్నది నాకు తెలిపింది
ఆ ప్రేమనగరుకే పోతాను
ఈ కామనగరుకు రాను - ఇక రాను ॥టా॥

ఇచ్చుటలో వున్న హాయి - వే
రెచ్చటనూ లేనే లేదని
లేటుగ తెలుసుకున్నాను - నా
లోటు దిద్దుకున్నాను - ఆ
స్నేహనగరుకే పోతాను
ఈ మోహనగరుకు రాను - ఇక రానేరాను ॥టా॥

మధుపాత్ర కెదలో ఇక ఏమాత్రం చోటులేదని
మనసైన పిల్ల చెప్పింది - నా
మనసంతా తానై నిండింది
నే రాగ నగరుకే పోతాను
అనురాగనగరుకే పోతాను పోతాను. ॥టా॥

★ ★ ★

# భలేరంగడు-1969

శ్రీ విజయమాధవి ప్రొడక్షన్స్ సంగీతం : కె. వి. మహాదేవన్

**1**

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

హిప్ హిప్ హుర్రే జిమ్ జకే
చేయీ చేయీ కలుపూ — నీదీ నాదీ తొలిగెలుపు
గెలుపే మెరుపై తెలిపేను తెలిపేను
బతుకు బాటలో మలుపు

స్నేహం ఎంతో తీయన — అది తెలిసిన మనసే చల్లన
స్నేహం ఎంతో తీయన — అది తెలిసిన మనసే చల్లన
తీయని చల్లని లేత మనసు
నీ స్నేహం వలన కమ్మన —

నీ కన్నులు చెప్పే కథలు — నా మదిలో చిలికేను సుధలు
నీ పెదవుల నవ్వులు వాడని పువ్వులు
ప్రతి పువ్వూ కురిసేను తేనెలు

పక్కన నీవుంటే — నే కంటానెన్నో కలలు
పండిన కలలో పొంగే అలలై
తేలిపోవాలి మనసు — జతతో

చేయీ చేయీ కలుపు
నీదీ నాదీ తొలిగెలుపు.

* * *

# ఆస్తులు-అంతస్తులు-1969

శ్రీ (ప్రొడక్షన్స్) సంగీతం : ఎస్. పి. కోదండపాణి

**1**

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

ఒక్కటై పోదామా ఊహాల వాహినిలో
మమతల తరంగాలపై మధువుల సుగంధాలపై
పరవశమొందగా ఏకమౌదామా ||ఒ||

ఓ అనురాగసీమలో అందాల కోనలో
అల్లారు ముద్దుగా వుందామా
సొగసైన పొదరింట — సొంపైన గిలిగింత
దోబూచులాడుతూ — నవ్వుకుందామా ||ఒ||

చిగురాకుల జొంపాల చెలరేగు చెలువాల
ఉయ్యాల లూగుతూ వుందామా
నింగిలో విహరించి నేలపై పులకించి
శృంగార జలధిలో తేలుదామా ||ఒ||

ఓ వలపుల జంటగా సరదాల పంటగా
సయ్యాటల పాటలై సాగుదామా
తారా చంద్రులమై రాధా కృష్ణులమై
తన్మయమొందుతూ కరిగిపోదామా.. ||ఒ||

★★★

# జరిగిన కథ-1969

నాగావళీ ఫిలిమ్స్ సంగీతం : ఘంటసాల

**పాడినవారు: ఘంటసాల, పి. సుశీల**

లామి లామి నెరజాణా ఎస్ డార్లింగ్
నా కిస్మి కిస్మి చినదానా - విత్ ప్లెజర్

లాలామి మొనగాడా - ఓ లాలీ
నా కిస్మి కిస్మి ఓ చిన్నోడా - ఎస్ బ్యూటీ
సుఖములు సొగసులు నీవేరా నా రాజా
కమాన్ నా ఆశ రమ్మందీ
గెటప్ నీ వలపు లెమ్మందీ

మగసిరితో మక్కువతో
మనసారా లాలించూ
ఒహో రంగేళి నీవైతే
ఒక కిల్లాడి నేనేలే
నీ పొగరూ నా నెనరూ
నేడే వూయల లూగించు. ॥లా॥

★ ★ ★

# మనుషులు మారాలి-1969

జెమిని　　　　　　　　　　　　　　　　సంగీతం : కె. వి. మహాదేవన్

**పాడినవారు: పి. సుశీల, పి. లీల**

భూమాత ఈనాడు పులకించెను
కోమలస్వప్నాలు కుసుమించెను
కామదేవుని సేన కదలాడెను
కర్పూర వాసనలు వెదజల్లెను　　　　　॥భూ॥

ఉల్లాసవీణల మీద — సరస
సల్లాపగీతులు మ్రోగె
మధుమాసమే అతని దరహాసమై
నవ్యమాధుర్య మోహాలు చెలరేగెను　　　　　॥భూ॥

యువరాణి హృదయము విరిసె — క్రొత్త
ఉత్సాహమేదో వెలసె
ఎల జంటలే — విమలకలహంసలై — దివ్య
రసరాజ్య శిఖరాల విహరించెను.　　　　　॥భూ॥

* * *

# టక్కరిదొంగ చక్కనిచుక్క-1969

రవిచిత్ర ఫిలిమ్స్ సంగీతం : సత్యం

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

వయసుకుర్రది - వంపులున్నది
నైసు నైసుగా అయిసు చేస్తది

మైకంలో ముంచెత్తే అందాలు
పైకంతో కొనలేని పరువాలు ॥వ॥

చూపుల్లో - నిషా వున్నది
రూపంలో - మజా వున్నది
సుఖాలన్నీ - ఒకేసారి లభించేనోయ్ ॥వ॥

అందరికీ కావాలి ఆనందం
కొందరికే దొరుకుతుంది మకరందం
గుమ్మయినా గులాబి మొగ్గ
ఊరించే మిఠారి బుగ్గ
అదీ నీదే - ఇదీ నీదే - కుషీ నీదేనోయ్. ॥వ॥

**2**

పాడినవారు: పిఠాపురం

నేనే మాలిష్ వాలా నా పేరే సిన్నయ లాలా
రాకెండ్ రోల్ వరసలో వాయిస్తా తలపై తబలా
దొరలేసే స్టెప్పులకైతే పాలిష్ జరూర్
టోపీల బుర్రలకైతే మాలిష్ తయ్యార్
అరె బేటా - దొరకొడకా
సెవిలో రాళ్లూ తలలో కుళ్లూ
సేత్తో తీసి పారేస్తా - మాలిష్ తలకాయ మాలిష్ ॥నేనే॥

లూజైతే తలలో సీలు బిగిస్తా బిడ్డా
టైటైతే తలబిరుసంతా తగ్గిస్తారా
నా మాలిష్‌తో మంత్రవుతావు
ఛాన్సుపోతే రాదు ॥నేనే॥

మా రాజులు ఓడే తైలం మందిస్తాను
జవ్వాది అత్తరు వాసన చూపిస్తాను
అరెబేటా - దొరకొడకా
కంట్లో పెద్దడేరా యేసి - స్టంటు సినిమా సూపిస్తా
మాలిష్ - తలకాయ మాలిష్ ॥నేనే॥

* * *

# బందిపోటు భీమన్న-1969

భాస్కర్ పిక్చర్స్ సంగీతం : టి. వి. రాజు

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

తడి తడి చీర తళుక్కుమంది
చలి చలి వేళ చమక్కుమంది
నీళ్లలోంచి పిల్ల వచ్చిందోయ్
అది నీళ్లు పిండి మొఖాన కొట్టిందోయ్ ॥తడి॥

జాంపండులాంటిపిల్ల జలకాలాడితే
పొదలచాటున పోకిరికళ్లు పొంచిచూశాయి

పొంచిచూడ లేతఒళ్లు పొంగిపోతుంది ఆ
పొంగు పొగరూ చూసి మనసు పొందుకోరింది ॥తడి॥

నిమ్మపండు వంటి మేను నిగనిగలాడింది
కమ్మ కమ్మని కన్నెపిల్ల కన్నుకలిపింది

దొండపండు లాంటి పెదవి తొందరపెట్టింది ఆ
తొందర చూసి అల్లరి పిల్ల దోబూచులాడింది ॥తడి॥

తనివి తీర్చమంటూ వయసు తహతహలాడింది
చనువు తీసుకుంటే సొగసు చకచకలాడింది

గడుసుదనం చూస్తే గుండె గతుక్కుమంటుంది – ఈ
పడుచుపిల్ల నీతో కలిసి అతుక్కుపోతుంది. ॥తడి॥

★ ★ ★

# మూగనోము-1969

ఎ. వి. ఎమ్. ప్రొడక్షన్స్ సంగీతం : ఆర్. గోవర్ధనం

**పాడినవారు: ఘంటసాల**

ఊరు మారినా ఉనికి మారునా
మనిషి దాగినా మమత దాగునా
మరలిరాని పయనంలో మజిలీలేదు
ఆడదాని కన్నీటికి అంతేలేదు ॥ఊ॥

అనురాగతాపం అసమానత్యాగం
స్త్రీజాతికొరకె సృజియించెదైవం
చిరునవ్వులన్నీ పెరవారికొసగి
చీకటులలోనే జీవించు యువతి
తలపులే వాడవు – వాడేది తనువే ॥ఊ॥

మగవానికేమో ఒకనాటి సుఖము
కులకాంతకదియే కలకాల ధనము
తనవాడు వీడ అపవాదుతోడ
పదినెలల మోత చురకత్తి కోత
సతులకే ఎందుకు ఈ ఘోరశిక్ష
సహనమే స్త్రీలకు శ్రీరామరక్ష ॥ఊ॥

**2**

పాడినవారు: పి. సుశీల, బృందం

తల్లివి నీవే తండ్రివి నీవే
చల్లగ కరుణించే దైవము నీవే ॥త॥

వేడుకొన్న దయతలిచే వెంకటరమణా
తోడునీడవై మాపై చూపుము కరుణా
వెంకటరమణా వెంకటరమణా ॥త॥

నీకన్నా మాకెవరూ లేనేలేరు
నీ దీవనలే మాకు చాలు వెంకటరమణా
వెంకటరమణా వెంకటరమణా ॥త॥

గాలిలోన దీపంలా ఉన్నామయ్యా – నీ
జాబిలివల్లనె వెలుగు నిలిచేనయ్యా
నీ పూజకొరకు పూచిన పువ్వులమయ్యా
నీ పాదాలే మాకు శరణు వెంకటరమణా
వెంకటరమణా వెంకటరమణా. ॥త॥

★ ★ ★

# చిరంజీవి-1969

అరుణాచలం స్టూడియోస్ సంగీతం : టి. చలపతిరావు

**1**

**పాడినవారు: ఎస్. జానకి, జయదేవ్**

నడుము వుందో లేదో తెలవదు
నాభిచూస్తే మనసు నిలువదు
వన్నెలాడిది ఎంతరంగు ఎంతరంగు ఏమిహంగు
ఓరబ్బొబ్బో –

తెలివి వుందో లేదో తెలవదు
తిక్కమాత్రం లెక్కతేలదు
కుర్రవాడిది ఎంతటెక్కు ఎంతటెక్కు ఏమినిక్కు
ఓరబ్బొబ్బో

పల్లెటూరిదాన – పలకవె నాతోన
ప్రేమచూడు – జోడుకూడు – ప్రేమలోన హాయిచూడు
ఓరబ్బొబ్బో

పట్నవాసం బాబు – అట్టహాసం బాబు
పైపటారం లోలొటారం – నమ్మలేను – నమస్కారం
ఓరబ్బొబ్బో

తాళలేనే మోహం – తాపమాయెనె దేహం
చేయవేల నీవు స్నేహం మీరుతోందే ప్రేమదాహం
ఓరబ్బొబ్బో

చిన్నదాన్ని చూడు – చింతబరికె చూడు
వీపుకొంచెం సాపుచేస్తే వీడిపోదా ప్రేమదెయ్యం
ఓరబ్బొబ్బో.

# భలేమాష్టారు-1969

వి. జి. డి. ప్రొడక్షన్స్ సంగీతం : టి. వి. రాజు

**1**

**పాడినవారు: పి. సుశీల, ఘంటసాల**

నీవునేనై నేను నీవే నీవే
ఎదలే లీనములాయె

పువ్వులలోని పొంగేమైకం నీవే
నవ్వులలోని నిగనిగలన్నీ నేనే
పూలతావి మోవికావి – నీవు నేనే
నీవునేనై నేను నీవే నీవే ॥నీ॥

చల్లగాలి వెచ్చని ఆశను నేనే
కన్నుల వెలుగు కౌగిలి చిగురు నీవే
వాడిపోనీ రాగబంధం నీవు నేనే
నీవునేనై నేను నీవే నీవే. ॥నీ॥

* * *

# ఇంటిగౌరవం-1970

మధు పిక్చర్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

చింతపువ్వు ఎరుపు – చిలకముక్కు ఎరుపు
చేయి చేయి కలుపు – లేత వలపు తెలుపు.

మల్లె మొగ్గ తెలుపు – మంచి మనసు తెలుపు
చేయి చేయి కలుపు – నిండు వలపు నిలుపు

అబ్బ వూరించు పెదవుల ఎరుపు
అవి నాలోన ఆశలు రేపు

ఆగాలి పెళ్ళయేవరకు – ఆపైన తమదే గెలుపు
వలచేవేళ తొలగేవేల
ఈ ఎడమోము పెడమోము – రుచిచూడు పులుపు ॥చిం॥

అబ్బ నీ చేయి చిదిమిన చోట
అబ్బ నా బుగ్గ కందేను చూడు

నీ నవ్వు వెలిగిన చోట
నా మేను పొంగెను చూడు
నీలో నాలో ఒకటే ఆశ
అవి పండేను – మురిపాలు నిండేను – రేపు. ॥చిం॥

★ ★ ★

# దేశమంటే మనుషులోయ్-1970

ఫిలిం క్రాఫ్ట్స్ సంగీతం : ఎస్. రాజేశ్వరరావు

పాడినవారు: ఎల్. ఆర్ ఈశ్వరి, ఘంటసాల

ఇదిగో ఇదిగో – రానీ – రానీ మైకము
మనకేం పోతే పోనీ లోకము
అందమైన ఆడపిల్ల పక్కనుండి
ఒక్కసారి పొందుచేసి చూడమంది
ఇంతకన్న వింత వింత భోగమే లేదులే

పొంగుతున్న మోహము ఆపరాని ప్రవాహము
చేయివోయి స్నేహము – తీర్చుకో నీ దాహము
పిల్లమనసు మల్లెసొగసు కొల్లగొట్టి సుఖించవోయ్ ॥ఇ॥

ఇదా ఇదా నవీన భారతదేశము
విలాస జగతి సరసనే అభాగ్యజనులరోదన
నిషాల నాట్యమిచ్చట విషాదగీత మచ్చట
మదించె ఇచట యౌవ్వనం కృశించెనచట జీవనం
అమానుషం భయంకరం – కఠోర నగ్నసత్యము

పరవశించే కైపులో బాధలేవీ చూడకు
ఆటపాటల వేడిలో – ఆదమరిచి తేలిపో
నేడు పోతే రేపురెండు హద్దుమీరి హసించవోయి ॥ఇ॥

క్షమించరానికృత్యము అసభ్యసిరుల నృత్యము
తపించు దీనజనులకు సహాయహస్తమొసగుము
నశింపచేసి ఖేదము తపించు నవ్యలోకము
లభించసౌమ్యసంఘము – జ్వలింపజేయు – విప్లవం.

**2**

పాడినవారు: పి. సుశీల

ఊరిస్తా ఊపేస్తా ఓరయ్యో ఆటలాడిస్తా – ఆశరేపి
ఊసులాడి అబ్బో అనిపిస్తా – చాటుకొస్తావా
నామాట యింటావా – చాటుమాటు సంగతంటే చల్లబడతావా
రమ్మంటే వచ్చానా పొమ్మంటే పోతానా
రాలుగాయి సరసముంది రంజు చూస్తావా
ఓరయ్యో రంజు చూస్తావా ॥ఓరయ్య॥

దిమ్మతిరగాల నువ్వు గుమ్మయిపోవాల
కమ్మనైన కబుర్లుచెబితే కళ్లుతిరగాల
మత్తులా గమ్మత్తు చేస్తే మతులు పోవాల
ఓరయ్యో మతులు పోవాల. ॥ఊరిస్తా॥

* * *

# ఆడజన్మ-1970

విజయలక్ష్మీ మూవీస్ సంగీతం : మాస్టర్ వేణు

**పాడినవారు: పి. సుశీల**

నీమీద కన్నేసి నిలచితినోయ్ హోయ్ – తలచితినోయ్
నీ మగసిరి చూసి వలచితినోయ్ – పిలిచితినోయ్
ఒడిలోనవాలి సరసాలతేలి
నా కోరిక తీర్చలేవా రావా రావా ॥నీమీద॥

చేసే మజాలలోన – పొంగే నిషాలయీాదులాడి మరి
జరిగే తమాష చూడు
ఒంపులు చూడు సొంపులు చూడు
ఒక్కమారు ముద్దాడు లాలించు
తనవులు మరిచే సరదాలలో మునిగిపో– తేలిపో
తేలిపో – తేలిపో ॥నీమీద॥

నిను చేరెను చక్కని జవరాలు
మనసారగ కోరెను మురిపాలు
తమితీరగ చేయును సరసాలు
ఇవే – రేగెను వలపుల కెరటాలు
లోకము మరిచే జలసాలలో మునిగిపో – తేలిపో
తేలిపో – తేలిపో. ॥నీమీద॥

★ ★ ★

# అగ్నిపరీక్ష-1970

పద్మాలయా మూవీస్ సంగీతం : ఆదినారాయణరావు

పాడినవారు: ఘంటసాల, పి. సుశీల

నాలోన నిన్ను చూసుకో
నీలోన నన్ను నిలుపుకో
నిండారు ప్రేమసీమలో నీవూ నేనూ ఒకటేలే ||నా||

ఈ వలపే శాశ్వతమోయీ
ఎన్నెన్నో యుగాలుగా నిన్నేకదా తలచాను
నిన్నే సదావరించాను

నమ్మినా మానినా నామది నీదేలే
జగాలు ఎన్ని మారినా
జతగా మనమే నిలుతములే ||నా||

కోరికలే పూచినపూలు
అవే మన తలంబ్రాలు అవే అవే వసంతాలు – అవే వరాలోయ్
వీడని కలయిక వాడని మాలిక
సరాగ స్వప్న జగతిలో
కలిసీ మెలిసీ కరిగెదనూ.

★ ★ ★

# సుగుణసుందరికథ-1970

పి. ఎస్. ఆర్. పిక్చర్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

మూగతలపు రేగుతూంది
మోహాల ముద్దులగుమ్మ ముచ్చటపడితె
ముసిముసి నవ్వుల మోజులుతీర్చాలి

ఓ జవరాలు కోరిన మగవాడే
పదివేల సొగసులు కలవాడు
మగసిరిజూపి మనసే దోచి
ఈ కాంతసరసను చేరె ఏకాంతసరసము కోరె
నీకింత బింకము తగునా చలమేటికి ॥ఓ॥

ఓ మనసావలచిన ప్రియురాలు
తనుచేయు నెన్నో త్యాగాలు ఏదో తలచె ఎదలో వలచె
మధురాతి మధురం వేళ
సుధలూరు అధరం కొనరా
కధమారిపోవును కదరా కౌనుకౌగిలి.

★ ★ ★

# బాలరాజుకథ-1970

లక్ష్మీ ఎంటర్‌ప్రయిజెస్ సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు: పి. సుశీల

మహాబలిపురం – మహాబలిపురం – మహాబలిపురం
భారతీయ కళాజగతికిది గొప్ప గోపురం.
కట్టించాడు ఈ వూరూ పల్లవరాజు
ఆ కథ చెప్పగా వచ్చాడు బాలరాజు

కంచి రాజధానిగా పాలించాడు యిది
మంచి రేవు పట్నంగా కట్టించాడు
తెలుగు సీమ శిల్పుల్నీ రప్పించాడు
పెద్ద శిలలన్నీ శిల్పాలుగా మార్పించాడు

పాండవుల రథాలని పేరుపడ్డవి
ఏకాండ శిలలనుండి మలచబడ్డవి
వీటిమీద బొమ్మలన్నీ వాటమైనవి
తాము సాటిలేని వాటిమంటూ చాటుతున్నవి

మహిషాసుర మర్దనం – గోవర్ధన మెత్తడం
మహావిష్ణు అవతారంగా అవతారం దాల్చడం
పురాణాల ఘట్టాలు పొందుపరచిరి
ముచ్చటగా కన్నులకు విందునిచ్చిరి

పాశుపతం కోరెను పార్థుని మనసు
పరమ శివుని కోసము చేసెను తపసు
సృష్టంతా కదలివచ్చి చూడసాగెను
ప్రతిసృష్టి ఈ శిల్పమనీ పేరువచ్చెను

సంద్రంలో కలిసినవి కలిసిపోయెను
ఒంటరిగా యీ కోవెల మిగిలిపోయెను
దేవుని పాదాలను కడుగును నిత్యం
మనుషుల పాపాలు ఇవిచూడ
తొలగును – సత్యం – సత్యం. ||మహా||

## 2

**పాడినవారు: పి. సుశీల, బృందం**

హిప్పీ హిప్పీ హిప్పీ ఆడపిల్లలో
వీళ్లు చెప్పరాని గొప్ప గొప్ప తారాజువ్వలో ||హి||

ఆడిపాడే అల్లిబిల్లి అల్లోనేరేళ్లు
మేము చూడ చూడ వేడి వేడి ఇనుపగుగ్గిళ్లు
పాతపట్నం చూడవచ్చాం
కొత్త ఫాషన్ తీసుకొచ్చాం

మీ కొత్త కొత్త ఫాషన్లు పాతవేనండి
ఈ పాత పాత బొమ్మలెపుడు కొత్తవేనండి
కట్టూ బొట్టూ పోనూ పోనూ పోయే పోకిళ్లు
చూస్తే పట్టపగలే యిట్టేయిట్టే పొడుచును చుక్కల్లు ||హి||

ఎగబడతాము ముచ్చటపడి డాన్సుకొరకు
దిగుమతి చేశాం విచ్చలవిడి
ట్విస్టు, స్వింగు, జర్కు, షేకు

దొరసరుకు దిగదుడుపు అంతా
తొక్కే చిందుల కలగలుపు
శివమెత్తే జాతరలో నాట్యందే గెలుపు
డాన్సు చేస్తే గుండె నిండా ఊరే ఉవ్విళ్లు
లక్కీఛాన్సు వస్తే ఒళ్లే తుళ్లిపొంగే పరవళ్లు ||హి||

చేయి చేయి చేర్చుకుందాం హాయిగా పిక్నిక్ చేసుకుందాం
చీకూ చింతా లేని వూరూ మావూరేనండీ
మాకూ మీకు ఈ విషయంలో తేడాలేదండీ
వేడుకలన్నీ వింత వింత తరగని పరవళ్లు
వెళ్లేటప్పుడు చల్ల చల్లని టాటా గిడిగిళ్లు. ||హి||

# 3

పాడినవారు: పి. సుశీల

చూడు చూడు తమాషా బలే తమాషా
వేడుకైన తమాషా వేళ్లతమాషా ఐదు వేళ్లతమాషా

అనగనగా ఒక పట్నం అది అరచేతి పట్నం
ఆ వూరికి ఒక రాజు – అతనికొక రాణి
ఇద్దరికీ పుట్టాడొక ముద్దుల కొడుకు
ఆ కొడుకు ఒకనాడౌతాడు పెళ్లికొడుకు ॥చూడు॥

అనగనగా యువరాజు ఒక పిల్లను చూశాడు
అందమైన అమ్మాయికి మనసు ఇచ్చాడు
ఇద్దరికీ కలిగింది ముద్దుల ప్రేమ
ఆ ప్రేమకు పడ్డది బ్రేకు అయ్యోరామా అయ్యయ్యోరామ

అనగనగ రాణికుంది – దగ్గిర చుట్టం
ఆ చుట్టం తెస్తుందట ఎంతో కట్నం
కట్నమెంతలావో ఆ పిల్ల అంతలావు
ఆ లావుతప్ప అందాలు ఆమెకు లేవు ॥చూడు॥

ఇదీ అదీ అన్నారు తల్లితండ్రులు
ఇదే ఇదే అన్నవి యువరాజు గుండెలు
ఇదా అదా ఇదా అదా తేలదెంతకీ
అది తేలగానే గాలికెగిరి –
కధ కంచికి – మనం ఇంటికె – ॥చూడు॥

* * *

# పగ సాధిస్తా-1970

రవిచిత్ర ఫిలిమ్స్ సంగీతం : సత్యం

పాడినవారు: ఎస్. జానకి

నే ముద్దాడనా – నీ తమితీర్చనా
కోరే నిషాలో కురిసే మజాలు
ఈ ముద్దులో ఉన్నవీ ॥నే॥

నేడు ఏకాంతవేళ – తోడు ఈ కాంత లేదా
అమరలోకాలలో సౌఖ్యాలు ఇవే ఇవే ॥నే॥

రేయి తెలవారరాదు
హాయిలో హద్దులేదు
రాగభోగాలతో –
సారము – ఇదే ఇదే. ॥నే॥

* * *

# మళ్లీ పెళ్లి-1970

మిత్రా ప్రొడక్షన్స్ సంగీతం : కె. వి. మహాదేవన్

పాడినవారు: ఘంటసాల

శుభముహూర్తంబున సొంపుగా పెండ్లికూ
తురుగావించు సంతోషశోభ
మక్కువమీరంగ మంగళస్నానాలు
కావింపజేయు ప్రగాఢవేళ

కళ్యాణవరముకై గౌరిని పూజింప
పొలతి కన్నులనిండు పుణ్యశోభ
మేళతాళాలతో మేలైన భక్తితో
మాంగళ్యముల దెచ్చు మహితశోభ

కన్నవారల కనులార కనెడివార్ల
మోములందున వెలుగు ప్రమోదశోభ
మరచిపోలేని జన్మలో మాసిపోని
శోభలకు శోభ పెండ్లి విశుభ్రశోభ.

పాడినవారు: ఎస్. జానకి

మలయ పవనాలు వీచి
మధు వనాలు పూచి
పగలే వెన్నెల కాచి
దిగులు దూరమైతే
మనసుకెంతో చల్లన – మమతకెంతో వెచ్చన

నీరెండవేళ గగనాన
ఓ రెండు మబ్బులు పరువాన
వడివడిగా పరుగులిడి
కొండఒడిలో కరిగిపోతే
మనసుకెంతో చల్లన - మనువుకెంతో వెచ్చన

బరువు తొలగిన గుండె పరిమళించే వేళ
పలవరించే మూగతలపు పాటపాడే వేళ
అలలాగ ఆశచెలరేగి లతలాగ ప్రేమ కొనసాగి
అనురాగం జగమైతే - వెలుగులన్నీ విందులైతే
మనసుకెంతో చల్లన
మరుపురాని దీవన.

**3**

పాడినవారు: పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

ఆగమంటే ఆగలేను - జాగుచేస్తే వూరుకోను
అడిగింది ఇవ్వకుంటే - అరగడియ ఓపలేను

ముట్టుకుంటే కందిపోతా పట్టబోతే పారిపోతా
పందిట్లో తాళికడితే తొందరలో సొంతమవుతా
నా కోసము పూచిన పువ్వు
పొదమాటున దాచకు నవ్వు

పూచిన పుష్పాలు తోటకు అందాలు
పొరబడి తుంచకు నువ్వు
నీ ఘుమఘుమలు - నా తహతహలు
ఇంక కువకువలు కావాలి - నేడు ||ఆ||

నీ ఆశలు నాకూ ఉన్నా
నునుసిగ్గుల సంకెళ్ళు కలవు
సంకెళ్లు తెంచాలి ఉవ్విళ్లు పెంచాలి
కౌగిళ్ళ కరగాలి మనము

ఈ సిగ్గులనే విరిమొగ్గలను
నీకు కానుక యిస్తాను రేపు. ||ఆ||

## 4

### పాడినవారు: ఘంటసాల

ఇదేనా భారతీయము
ఇదేనా సదాచారము ॥ఇదే॥

దేవుడు వేసిన దివ్యబంధము
మనిషి తెంపుటేనా
తీయని కమ్మని దీవెనలన్నీ
తీవ్రశాపమేనా ॥ఇదే॥

కలసిన మనసుల కరిగిన తనువుల
కాగితాలు విడదీసేనా
కంటినీళ్లు తొలిపంటకాల్వలై
కలతలపైరే పండేనా ॥ఇదే॥

అనుమానాలకు అనురాగాలు
ఆహుతి కావలెనా
ఆ పెనుభూతానికి వనితజీవితం
ప్రళయము కావలెనా?
ఇదేనా భారతీయము
ఇదేనా సదాచారము. ॥ఇదే॥

### పాడినవారు: ఎస్. జానకి

అమ్మా గౌరీ భవానీ – జననీ
ఈ మౌనమేలనమ్మా నీ మహిమ చూపవమ్మా
నే నోచిన నోములు చేసిన పూజలు ఇంతేనా తల్లీ
నీ నామస్మరణ నిష్ఫలమైతే బ్రతకలేను తల్లీ
పతి దేహములో సగము నీవనీ
మరచిపోకుమమ్మా
నీ భక్తురాలికీ భాగ్యమునొసగా
జాగు సేయకమ్మా
చోటులేని నాబోటిదానికి నీవే శరణమ్మా
దావానలము దహించసాగె దారి చూపవమ్మా
దారి చూపవమ్మా దారి చూపవమ్మా. ॥అమ్మా॥

# ఇద్దరు అమ్మాయిలు-1970

ప్రొడ్యూసర్స్ కంబైన్స్. సంగీతం : కె. వి మహదేవన్

**పాడినవారు: పి. సుశీల**

ఓ మిస్టర్ బ్రహ్మచారీ ఒకటోరకం బ్రహ్మచారీ
నా ఓర ఓర చూపుల్లో వయ్యారాల కైపులో
పడగానే అవుతావు – సంసారి – ॥ఓ మిస్టర్॥

కోటిలో ఒకడే ముని కాగలడు
కోటకు ఒకడే రాజవగలడు
ఒక్కొక్క వ్యక్తీ ఒంటిగా వుంటే
ప్రపంచమే హరాత్తుగా సమాప్తికాదా ॥ఓ మిస్టర్॥

ఈ జగమంతా జంటల మయము
ఇంపూ సొంపూ కలసిన జయము
ముద్దూ మురిపెం ముచ్చటతీర
ఇద్దరి హోయికి హద్దు లేదులే. ॥ఓ మిస్టర్॥

* * *

# తల్లితండ్రులు-1970

రామవిజేతా ఫిలింస్ సంగీతం : ఘంటసాల

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

ఇదే శృంగారమోయ్ - ఇదే ఆనందమోయి
పరువంలోనే మనసుకునచ్చే
సరసములాడి జీవించాలి ॥ఇదే॥

నిషాకనుల జవరాలు హుషారైన చెలికాడూ
మజా చేయాలి కలిసి సుఖం పొందాలి మురిసి
అంతా జంటలు కట్టాలి
ఒంపూ సొంపూ వయసూ సొగసూ
వలపుల పంటలు పండాలి
మునిగి తేలాలి ఆనంద కెరటాలలో ॥ఇదే॥

విలాసాలు దోషాలా వినోదాలు నేరాలా
కుషీలేని ముసలివాళ్లే నిషేధాలు పెడతారు
హద్దూపద్దూ ఏమీలేని ముద్దూముచ్చట తేలాలి
అమరసౌఖ్యములు చూడాలి ఈరోజునే ॥ఇదే॥

కులాసాల సయ్యాట - గులాబీల పూదోట
సరాగాల పన్నీట సుఖించాలి ప్రతిపూట
మైమరపించే ఎద పులకించే
మమతలలోనే కరగాలి
మధువునుమించే మైకమునిచ్చే
వలపుల ఒడిలో ఒరగాలి
రాగభోగాల ఉయ్యాల ఊగాలి. ॥ఇదే॥

★ ★ ★

# శ్రీదేవి-1970

మహావిష్ణు ఫిలిమ్స్ సంగీతం : జి. కె. వెంకటేష్

**పాడినవారు: పి. సుశీల, ఘంటసాల**

చిరుగాలే వింజామర – చిట్టిపాపే కెందామర
చిలకమ్మా పాడింది చెవిలోన జోల జోజోబాల ॥చి॥

మా ఇంట వెలిసింది శ్రీదేవి తాను
మౌనాన తెరచింది కెమ్మోవి
రతనాల నవ్వులే విరిశాయి
రంగారు మురిపాలు మురిశాయి ॥చి॥

నిదురలో పాపాయి పలువరింతలు. – అవి
ఎదలోన తల్లికి పులకింతలు
ఆ తల్లిలో మధురభావాలు
అందాలపాపకు దీవెనలు ॥చి॥

ఉయ్యాలలో బొమ్మ నీ తమ్ముడే – నీ
ఊహ పండించు ఆ దేవుడే
కోరికల తోటలు చిగురింతలు – అవి
కుసుమించు దినదినము వేయింతలు. ॥చి॥

* * *

# బస్తీకిలాడీలు-1970

శ్రీచిత్ర　　　　　　　　　　　　సంగీతం : ఎస్. హనుమంతరావు

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

ఒక్కసారి　నవ్వాలి ఓ లలనా, ఓ చెలియా
కోపమా నామీద ఓహో గులాబి - ఘుం - ఘుం

ఒక్కసారి నవ్వదులే - ఈ లలనా యీ చెలియా
కోపమే నీమీదా - ఓహో - ఆహా చలాకి భం భం

చక్కలిగింతల చక్కనినటన
తమాషపనులే నేరములా

ముసుగులోని ఆటలా మోటుసరసాలా
మునుపే తెలిసే దొరగారి అల్లరి ॥ఒ॥

ప్రియురాలితో యివే సరాగములా
జతగానిపై ఇవే వయ్యారములా

మదిలోన ప్రేమతో అన్నానులే
ఒకసారి నవ్వాలి కిలాడి సి. ఐ. డీ
కోపమా నామీద - ఓహో ఆహా చలాకి భం భం... ॥ఒ॥

★ ★ ★

# ఖడ్గవీర-1970

విజయరాణి కంబైన్స్ సంగీతం : టి. వి. రాజు

## 1

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, రఘురాం, జయదేవ్

మడమతిప్పని వీరులం
మాటతప్పని ధీరులం
కొండలైనా కోటలైనా
పొంగి దూకే యోధులం ॥మ॥

ఎత్తిన కత్తిని దించక
ఎవ్వరికీ తలవంచక
కుత్తుకలే తెగిపోయినా
గుండెల్లో చెలియించక
శిఖరాలలాగ జీవించేము
సింగాలలాగ విహరించేము ॥మ॥

జాతి మేలును తలచీ
నీతికి ఊతగ నిలిచీ
మంచిని పూజించాలనీ
వంచన నెదురించాలనీ
సంఘం నేర్పెను మాకు
రణరంగం నేర్పెను మాకు ॥మ॥

ముగ్గురి పాటా ఒకటే
ముగ్గురి బాటా ఒకటే
ఎంచిన న్యాయం ఒకటే

ఆశించిన ధ్యేయం ఒకటే
పేరుకు మాత్రం ముగ్గురం
ధీరతలో ముక్కోటులం
రణధీరులం ఖడవీరులం. ॥మ॥

**2**

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

చేతికి దొరికిన చిట్టెమ్మా
చిరాకు పడకే చిలకమ్మా
మనసు పడి వచ్చానే
మరులు కొని తెచ్చానే
వలపులిమ్మన్నానే ॥చే॥

చెక్కిలి మీటకు చిన్నోడ
చెలాకి కోరికలున్నోడ
మగువనని వచ్చావా - మనసు కనుగొన్నావా
మరులు కొని తెచ్చావా మనసు కనుగొన్నావా

నీ కళ్లల్లో దాగున్నాను - నీ గుండె సవ్వడి విన్నాను
కళ్లల్లో దాగుంటే కన్నెమనసు కనుగొంటే
చెంగుమని దూకి చెంపలను తాకి
చిలిపిగా నవ్వేవా? ॥చే॥

అందాల పరువం పూచింది
ఆపైన చిరుగాలి వీచింది
కలిగినా గిలిగింత
తెలిసెనా మనసంతా
వేడికాగిలి వీడకే చెలీ
తోడు వుందామే. ॥చే॥

## 3

**పాడినవారు: జమునారాణి**

జింజినకడి జింజినకడి దిష్టిబొమ్మా
వెనకాలే వుండాలి తోలుబొమ్మా
నీ వెనకాలె వుండాలి తోలుబొమ్మా ||జి||

మాటల్లో వుంది మజా మజా
మస్కాలో పడనివాడు లేడు రాజా
నీ ఇల్లు నేలగట్టు – నీకుందీ పెద్దపొట్ట
నీనోట లడ్డుకొట్టు
పక్కల సూస్తావేంది గానాబజానా
సుక్కేసి నిదురపో బుల్లినాయినా
జవానా తందానా పరేనా ||జి||

తోక తొక్కిన పాము సూస్కోరా
కాటేసి పోతాది కాస్కోర
చూస్కోర మామా చూస్కో
కాస్కోర మామా కాస్కో
చూస్కో ఉస్కో ఆ ఉస్కో

తాడిచెట్టు ఎక్కే వాడుంటేను
వాని తలదన్నే వాడొక డుంటాడు
ఉంటాడు వస్తాడు – అంతుచూస్తాడు ||జి||

పైకెక్కి కూర్చున్న మొనగాడు
పడకుండ పోడులే – ఒకనాడు
ఓ రొయ్యమీసం బావా
ఇకనైనా తెలుసుకోవా
వహ వహ – వరేవా

రాసిపెట్టుందిరా రామకీర్తనం
స్థిరమేమి కాదురా అధికారం
ఆకారం – ఈబేరం – రం – రం...... ||జి||

## 4

### పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

నా కౌగిలి నీ గిలిగిలి
పొంకమైనది బింకమైనది
పొందుగోరి నీ స్వంతమైనది
పొంగే పరువం – లొంగని అందం
మోజు పడినవోయీ ॥నా॥

మధువులోన నా మనసు
కలిపితి నీకై నీకై
మనసుతీర నా మమత
తెలిపితి నీతో నీతో
నీవు గ్రోలితే నేను సోలెద
కన్నుగీటితె కరిగిపోయెద
ఆడది తానే ఆహ్వానిస్తే – అలుసుచేయకోయీ ॥నా॥

మత్తులోన గమ్మత్తు ఉన్నది రాజా – రాజా
మైకమందు తానేకమైనదీ – రోజా రోజా
వేడివలపులే విందులైనవి – పండుయౌవనం పానుపైనది
ముసిముసినవ్వుల మోవినిచేర్చి ముద్దుతీర్చవోయీ. ॥నా॥

## 5

### పాడినవారు: పి. సుశీల

నను కాదని ముందుకు పోలేవు
నా కన్నులలోనే వున్నావు
ఓ ప్రియా ఓ ప్రియా ॥నను॥

కలికి అలిగిన అందం
మగరాయడా నీకు అలకేలరా
ఓ నెలరాయడా మబ్బుతెర యేలరా ॥నను॥

కలువ కన్నులు చూడు
అవి కలవరించెను నేడు
ఎలనవ్వు వెన్నెల చిలికించరా
ఆ తొలినాటి పులకింత అందించరా. ॥నను॥

జోడుగూడిన మనసు
అది వీడిపోదని తెలుసు
క్షణకాలముంటుంది చెలిపైన కోపం
కలకాలముంటుంది అనురాగదీపం. ॥నను॥

★ ★ ★

# పెళ్ళికూతురు-1970

శ్రీప్రొడక్షన్స్ సంగీతం : ఎస్. పి. కోదండపాణి

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, ఎల్. ఆర్. ఈశ్వరి, పిఠాపురం

వెర్రి మొర్రి వెంగళప్ప పుట్టిన రోజంట
వీడు ఆడిందల్లా ఆట పాడిందల్లా పాట
వింత చూడాలంటే వేయికళ్లు కావాలంట ॥వె॥

బువ్వకలిపి తినడానికి బుద్ధి ఎందుకంట
బుద్ధి ఎక్కువైనకొలది బోలెడంత తంటా

తినమంటే అయ్యగారు తిమ్మరాజట
పనిచెబితే బాబుగారు – పోతురాజట
వీడిముందు – ఎవరైనా బలాదూరట ॥వె॥

తోక ఒకటి లేదుగాని ఆంజనేయుడే
తొండ మొకటి లేదుగాని బొజ్జగణపతే
కోక కట్టి వదిలిపెడితె కులుకులాడియే
కొమ్ములొచ్చి కుమ్మబోతే కోడెదూడయే
పోగ్గాడి ప్రతాపాలు – సోడా పొంగులు ॥వె॥

కన్ననాడు వీళ్ళమ్మకు ఘడియనొప్పులే
లోకానికి నాటినుండి ముప్పుతిప్పలే
వసుదేవుడు వీడికాళ్లు పట్టుకున్నాడ్రోయ్
ఆ దేవుడు నెత్తినోరు మొత్తుకున్నాడ్రోయ్
ఇట్టివాడు మరి మరి పుట్టబోడట. ॥వె॥

★ ★ ★

# ద్రోహి-1970

విజయ, సురేష్ కంబైన్స్ సంగీతం : జె. వి. రాఘవులు

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

జలసా నాదే - అహ
సరదా నాదే
కలిగినమైకం దిగనీకు
కమ్మని యువతిని కాదనకు ॥జ॥

మోసము దగా ప్రపంచము
ఆశలు బలే విచిత్రమూ
అంతా స్వార్థమూ
ఒకరిది ధనం వేరొకరిది సుఖం
సుఖమే ముఖ్యము ॥జ॥

వలపుల నిషా హుషారులో
బ్రతకర ఇలా నవాబులా
నియమా లెందుకూ
చెడినను వ్రతం - లభించును ఫలం
మరేమి కావాలీ. ॥జ॥

★ ★ ★

# యమలోకపు గూఢచారి-1970

శ్రీఉదయభాస్కర్ పిక్చర్స్ | సంగీతం : శివారెడ్డి

**పాడినవారు: జమునారాణి, బెంగుళూరు లత**

కానీ కానీ పరేదాచుకో
కలిగే ప్రేమ వయారీ

పోనీ పోనీ గుబాళించనీ
నీలో వలపుల గులాబీ ॥కా॥

దోరవయసు దోచినవాడా
కన్నెమనసు దూసినాడా
నా చూపు రమ్మంది - ఆ రూపు వచ్చింది
అందాలే కానుకలాయెను
పూచింది పొంగేసొంపు - మురిసింది మూగతలంపు
ఇంపారనావామె నీ వంపులే
నీ రాజు వస్తాడు - నీ కళ్లు మూస్తాడు
నీ వూహాలు ఊయల లూగు
ఒకసారి పలకరిస్తే - ముమ్మారు పులకరించు
నీ మేను పరవళ్లు తొక్కేనులే. ॥కా॥

**2**

**పాడినవారు: పి. సుశీల, బృందం**

మధువే పొంగాలి – అది మైకం యివ్వాలి
మధువే పొంగాలి – అది మైకం యివ్వాలి
మనసే పరవశమొందగా – మైమరచీ ఉయ్యాలలూగగా
మత్తుగా గమ్మత్తుగా సరికొత్తలోకముల విహరించాలి ॥మ॥

కోడెవయసు బుసకొట్టనీ వేడివయసు త్వరపెట్టనీ
తీయని కోరిక తీరకపోయిన – తెగించి సుఖించవలె
వేయివిధాల వినోదములున్నవి – విలాసవిధానమిదే ॥మ॥

నునువెచ్చని తమిహెచ్చగా మన తనువులు
కలిసిన – అదే అదేకద అమరసుఖం ॥మ॥

రూపులోన జిగి వున్నది – కైపులందు బిగి వున్నది
పండిన ఆశల పండుగ చేయుము – పరమచిరాకు – సుమా
ఉండకు ఉండకు ఒంటరితనమున
ఇలా దిగాలుపడీ
సఖి అందమే – మకరందమూ
అనుబంధం పెరిగిన – అదే
అదే కదా అమరసుఖం. ॥మ॥

* * *

# పసిడిమనసులు-1970

ఉషశ్రీ ప్రొడక్షన్స్ సంగీతం : అశ్వత్థామ

**పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, ఎల్. ఆర్. ఈశ్వరి**

లలలా - అందుకో కలకలా కిలకిలా
జిగిబిగి నగవుల నూరేళ్లు
ఉండిపో తలచిన వలచిన
తరగని సుఖములు - వెయ్యేళ్లు
ఆనంద శిఖరంమీద విహరించినాను
అనురాగ భవనంలోన - నివసించుతాను

ఊహలో ఊరే ఉవ్విళ్లు
స్నేహమే తొక్కే పరవళ్లు
కనుల మిలమిల మనసు కువకువ
పసిడిగల కోరికా మిసిమిగల కానుకా?
ఊగెను నా మది డోలికా ॥అందుకో॥

పండాలి చూపుల్లో నూరేళ్లపంట
ఉండాలి గుండెలనిండ స్వప్నాలతేట
నీకు జత ఎవరో వస్తాడూ
నిండుమది నీకే యిస్తాడూ
మరులుకొను ఎద - మధురమగు కథ
వేణువై వూదునో - వీణగా మీటునో
గానమై లీనమై మ్రోగునో - ॥అందుకో॥

★ ★ ★

# పెత్తందార్లు-1970

జ్యోతీ సినీ సిండికేట్ | సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు: పి. సుశీల

మైమరపో తొలివలపో యిది
మమతల మగతల కలగలుపో
ఏమిటో ఇది ఏమిటో ||మై||

అతడు నవ్వెను తనలోతాను
ఆశలు రేగెను నీలో నీకు
పెదిమల అరుణిమ పెరిగినదీ – నీ
హృదిలో మధురిమ పొంగినదీ ||మై||

గుండెల దడదడ మితిమీరే – నీ
కోమల గళమున శృతిచేరే
గాలి సోకితే కాకలు కలిగె
కాటుక కన్నుల రేకులు వెలిగె ||మై||

ఒంటరి హృదయము వలచినదే – నీ
జంట ఎవ్వరో తెలిసినదీ
చూపుల పంపవె సందేశం – ఎద
చోటు వున్నదే – నీ కోసం. ||మై||

* * *

# భలే గూఢచారి-1970

బసంత్ పిక్చర్స్ సంగీతం : చక్రవర్తి

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

కోరిక తీరాలిరా - పండాలి
ఈ మోహములు - నిన్ను వరించి పండాలి హాయ్

మోజయిన పిల్ల వలచింది
సరదాల హాయి తలచింది

తాజా పసందు అందాలు
నీ కొరకె చెలియ దాచింది
నీ గుండెనిండ నాటింది - ఓ

కలచే కరారి గెలిచే సింగారి
మెరిసే మిరారి రమ్మంది ||కో||

ఇంపైన ఆట ఆడాలి
జలసాలు కలిసి చేయాలి
సొంపైన హాయి చిందాలి

మనసైన చిలక మురిపిస్తే
పొంగే నిషాల తేలాలి - ఓ
గోరింక చిలకమ్మ చేరి
చెలగే మజాల యాదాలి - నీ

కోరిక తీరాలిరా - పండాలిరా. ||కో||

## 2

### పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

నీ వళ్ళు నా వళ్లు తొక్కాలి పరవళ్లు
నీలాల కనులలో ఊరాలి ఉప్పిళ్లు
ఈ ఎదలే మిసిమించాలి - అహో
మిల మిల మిల మిల

నీ వళ్లు నా వళ్లు పరువాల పందిళ్లు
వూరించే తేలించే రాగాల పొదరిళ్లు
ఈ ఎదలే ఇక నవ్వాలి - అహో
కిల కిల కిల కిల

చూశాను నిన్ను కలలో - పడినానే సొంపుల వలలో
షోకిళ్ల చిన్నదానా కరగాలే నువ్వు నాలో
నీ మనసే వలచింది నా మనసే పిలిచింది కమ్మగా కమ్మగా
అందాల పూలమాల హృదయాన దాచనేల
అల్లాడినాను చాలా ఇకపైన జాలమేలా
నీ చేయి నా చేయి పెనవేయి అమ్మాయి - కమ్మగా కమ్మగా
దాచెయ్యకే అనురాగం చూపించవేల స్వర్గం
ప్రేమించినా - ఆహాఁ నలుగురిలోచూస్తే సిగ్గేస్తాది
మనసైతే తెరచాటు మనకుందే - రావేమే కమ్మగ కమ్మగా.

## 3

### పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

లోకులంతా చూస్తారు రా రాజా
పోకిరీ పనులే - చాలు చాలించరా
చూడనీవే మనకేమిటే - నా రాణి
సొగసైన. పరువాలన్నీ దాచేయకే

నిన్ను కోరింది నా దోరవయసు
నన్ను ఆపింది యీ పాడుసిగ్గు

వమ్ముకారాదు అరనిముషమైన
రమ్ము కరగాలి కౌగిళ్లలోన
సరాగాల వూరించి తమిరేపకు
విలాసాలవేళ వృధాచేయకు
చూడు ఈ పూలు మనకొరకు పూచె
సోలిపోదాము విరిపాన్పు వీచె
వలపు కెరటాలు నాలోన లేచె
చిలిపి సరదాలు నను ముంచివేసె
సరే తేలిపోదాము తరంగాలపై
ఎటో ఎగిరిపోదాము విహంగాలమై.

## 4

పాడినవారు: పి. సుశీల

హాఁ పిన్నీ పిన్నీ ఈడే పాడు సిన్నాడే
పైన బడతడే – హా
సందులోనా పొంచి గొందులన్నీ
కాచాడు ఆకతాయి – ఓలమ్మో
ఆడో పెద్ద కేడీ సోగ్గాడేనంట
నకిలీ మనసే యిత్తడీ
నాకే టోపీ వేత్తడే
కాని కోరుకుంటే దొరయ్యేనంట – ఆడు
సూడే పిన్నీ సిన్నాడే.
వెంటపడి – గిల్లాడే గిల్లాడే

సిలిపి సిన్నాడే – ఏసెనె సిటికె
ఈల ఏసిండె వలపుల గిలక
ఆగి కులికి – నిన్న సెంతకురికి
నిమరినాడే నా సెంపలే
అలా అలా సూస్తూ ఊరిస్తడే – సిగ్గు దోస్తడే
కొంగు పట్టుకొని లాగిండె సక్కని గడుగ్గాయి. ॥ఓలమ్మో॥

అదు ఎదటుంటే నేనే మిడిసిపడతా
అదు లేకుంటే ఏదో కలత
ఈడకుంటే – ఆడే యీాడనుకుంటే – పిల్లమరులన్నీ ఇచ్చేస్తానే
కొల్లగొట్టి ఎదఎంత లాగినా మైకమవుతదే
సూపులోపల నాటె మనసె – ఆడె గడుగ్గాయి.

**5**

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి

నిన్ను గెలిచే కిలాడిని నేనేలే
మరులు పెంచే రంగేళిని నేనేలే
చూడు తొలిప్రేమ నీదేను రావోయి
కన్ను మెరిసిందిరా – నన్ను కలిచిందిరా
ఆశ రగిలిందిరా కోర్కె రేగిందిరా
మదనతాపానికే కరిగె నా జీవితం
నిన్ను నమ్మేనురా కులుకు పండించరా – వచ్చి పండించరా

ఎదల ప్రేమామృతం గ్రోలితేనే మజా
గ్రోలి సయ్యాటలా తేలితేనే మజా
వలపు దోసిళ్లలో పుచ్చుకో పానకం
కైపు ఎక్కించితే – సోలిపడితే మజా – తమాషా మజా.

★ ★ ★

# అక్కా చెల్లెలు-1970

జగపతి ఫిలింస్ సంగీతం : కె. వి. మహదేవన్

**పాడినవారు: పి. సుశీల**

చకచకలాడే పడుచుంది
రెపరెపలాడే పొగరుంది
చాటుకిరా మాటుంది ॥చక॥

విచ్చీ విచ్చని పూవుంది
వచ్చీరానీ వయసుంది
ముసిముసి నవ్వులమోహంవుంది
మోజులుతీరే వేళుంది ॥చాటుకి॥

సోగలు తీరే సొగసుంది
సొగసుకు తగినా సోకుంది
చక్కదనాలా చనువుంది
పక్కకి వస్తే ఫలముంది ॥చాటుకి॥

రేయి యింకా సగముంది
హాయి నీకై నిలుచుంది
తీయనిమోహం నీలోవుంటే
తీరనిదాహం నాలోవుంది. ॥చాటుకి॥

## 2

పాడినవారు: పి. సుశీల

సంతోషం చేసుకుందాం నాతో వుంటావా
సరదాలు తీర్చుకుందాం నాతో వస్తావా
నాతో వస్తావా వస్తావా వావా

మీ ఇంట్లో తీరని కోరిక మా యింట్లో తీరుస్తా
ఇన్నాళ్ళూ చేయని సరసం యీనాడే చేయిస్తా
మొగమాటం లేని ముచ్చట – మగవాడా దొరుకునిచ్చట
విచ్చలవిడి శృంగారంలో – మనువెచ్చని హాయిపొచ్చట ॥సం॥

చేతకానివాళ్లే ఎన్నో నీతులు చెప్తారు
చేతనైనవాళ్లే నా చెలిమి చేస్తారు
పడుచుదనం పోతేరాదు – పరవశించు – నేరంకాదు
సడలక పై అన్నావంటే – స్వర్గం ఎంతోదూరం లేదోయి
నాతో వస్తావా – వస్తావా – వా. ॥సం॥

ఒడిలోన చక్కనిచుక్క ఒళ్లుమరిచి రావాలీ
కడుపులోన వేసిన చుక్క కైపెంతో ఇవ్వాలీ
కరిగిపోని తిమ్మిరిలోన – కన్నెపిల్ల కౌగిలిలోన
కళ్లుమూసి లోకం మరవాలి – కలికాలం కరగాలి
నాతో వస్తావా – వస్తావా – వా. ॥సం॥

* * *

# అడవి వీరులు-1970

నీలా ప్రొడక్షన్స్ సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు: పి. బి. శ్రీనివాస్

జోజో చిన్నారి నా చిట్టితల్లీ
జోజో బంగారు నా కన్నతల్లీ
పవళించు హాయిగా గారాలబాలా
పాడేను వనమంత నీకై జోల ||జోజో||

నీ బోసినవ్వులే నెలవంక తళుకు
నీ కంటి మిలమిలలు నీలి తారకలు ||జోజో||

గజరాజు ఉయ్యాల వూపేనులే
గండుకోయిల పాడేనులే – ఎల
గండుకోయిల పాట పాడేనులే ||జోజో||

నీ కోసమే నెమలి ఆడేనులే
నిద్రకన్యలు నిన్ను దీవించగా
భద్రకన్యలు నిన్ను కాచేరులే
జోజో బంగారు నా కన్నతల్లీ. ||జోజో||

**2**

పాడినవారు: పి. సుశీల, మాధురి

అల్లీబిల్లీ రాజాకేమో అందమైన అంబారీ
రాజువెంట వచ్చినట్టి రాణీ బలె సింగారి
మెకాలన్నీ చూసేందుకై షికారుగా సవారీ
చకచకా ముందుగనే సేనకూడ తయారీ

గట్టుమీంచి దుమికిందొక కొదమసింహం
దాన్నిపట్టి తిప్పికొట్టాడు మా రాజసింహం
కోపంతో గున్న ఏనుగు చేసే ఘీంకారం
దాన్ని గోతిలోన బంధించే వీరపటాలం ||అల్లీ||

కోయపిల్ల ఒకతెవచ్చి కన్నుకొట్టె
రాణి కుమిలిపోయి రాజును తన కొంగునకట్టె
కోయవాడు ఒకడు వచ్చి విందని చెప్పె
రాజు కొసరి నవ్వ రాణి మురిసి కొంగును విప్పె
చక్కనైన బాబుపుట్టె తండ్రిపోలిక
వాళ్ల పక్కయింటి ఆడపిల్ల తల్లిపోలిక
ఈడుజోడు కుదిరింది ఇంపుసొంపుగ
వాళ్లు మొగుడూ పెళ్లాలయ్యారు ముద్దు ముద్దుగా. ||అల్లీ||

## 3

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

జాం జాం సంతోషం ఎంతో మజా నువ్వు
జమాయించి నడవాలిరా భీమరాజా
తల్లిలేని పిల్లలా అడవి వున్నది – దాన్ని
సోకుటకై మింటిపైన మేఘమున్నది
నోరులేని మూగల్లే చెట్లు వున్నవి – వాటి
నూరించి భాషనేర్ప గాలి వున్నది ||జాం జాం||

అడవిమీద మీ జాతికి హక్కు వున్నది – మా
అందాల దంతాల తళుకువున్నది
నీకు నాకు విడిపోని బంధమున్నది – ఆ
బంధంలో ఏదో ఆనందమున్నది ||జాం జాం||

మా అమ్మను పెంచింది నువ్వేనట – నిన్ను
మనసారా తాతా అని పిలుస్తానట
ప్రేమతోన నీకు ముద్దులిస్తానట – నన్ను
పెద్దవాణ్ణి చేసే బరువు నీదేనట ||జాం జాం||

కోడెతాచు కోరల్లో విషముంటది – కాని
కోరి కరవ కూడదనే గుణముంటది
జనులకేమో బస్తీలో సర్వముంటది
సర్వంతోపాటు కొంత గర్వముంటది. ॥జాం జాం॥

# 4

పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

కనులే చెప్పగల కథ వుంది వింటావా
కలసీ మెలసీ విన ఫలముంది అంటావా
చెందన వృక్షాల చరియించు గాలి తడమి తలచెను నిన్ను
చెరియించు గాలికి వేరేమి తెలుసు అదిమది కలచెను నన్ను
చేమంతి బంతులాట ఆడుదామా
చెవిలోన గుసగుసలు ఆడుదామా
సైయ్యా – సై – ఆహో ఓహో

ఎలమావి విందులు ఇంపార్థకోరి వలచివచ్చెనుమనిషి
ఎదలు చేర్చి లతలా చిగిర్చి మధువులొలికే వయసూ
రెండింట ఒకటి విడదీయగలమా
మెండైన హాయి ఇక చెప్పగలమా
సైయ్యా – సై.

# 5

పాడినవారు: ఎస్. జానకి, ఎల్. ఆర్. ఈశ్వరి

విందుకు రమ్మనవే
అందరు మెచ్చే అతి మంచోడు
దొరకాబోయే జాతర – కన్నుల ॥వి॥

చప్పట్లమ్మా తాళాలు సందడి చేసే బాజాలు
చక్కనిచుక్కల టక్కరిభామల సరిజోడీల మేళాలు
తళుకుబెళుకులట తనివితీరునట
చల్లని వేళాకోళాలు – సరదాలు సరసాలు ॥వి॥

రాజనిమ్మల పళ్లు ఈడు మోజుపడ్డవి చూసుకో
రాలుగాయి పిల్లతోటి ఆడుకో
ఇంటిపక్క ఏరుంది జలకాలే జల్లుకో
ఏరువాక పడవలాగ సాగిపో
ఇద్దరికీ అద్దరికీ యీదుకో
ఏలబోవు రాజుమీద పాడుకో
మృగశిరకార్తి వచ్చింది తొలకరిజల్లు కురిసింది
నిగనిగలాడే సొగసరి మబ్బు నేలమీదనే నడిచింది
వయసుజంటల వలపు పంటలట
పచ్చనిబ్రతుకే పండింది – ఆడింది పాడింది. ||వి||

పాడినవారు: ఎస్. జానకి

ఊరంతా ఊరేగి వూరించే పిల్ల వన్నెలా
నేడు ఏ వూరిలో నీ పండుగా
నీ వున్నావు కొత్త పెళ్లికూతురల్లె
నీ అందాలు వెలిగేను అద్దమల్లె
భూమికి నీవిచ్చు మురిపాలు కోటి
భామను ఇస్తావా ||ఊ||

చలువ కిరణాల దొరసాని పిల్లకి
ఎవరు ఇచ్చారు ముత్యాల పల్లకి
మబ్బుల చాటున మీ పెళ్లి అయినదా
మా మంచి వరుడెవరో ||ఊ||

రేయి గగనాన వస్తావు ముందుకు
పగటి సమయాన వచ్చావు ఎందుకు
నీ చందమామయ్య సరసాలు దాచకు
నేస్తాన్ని నేనే కదా. ||ఊ||

## 7

### పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి, బృందం

అందుకో కత్తులు చిమ్మనిమ్ము నెత్తురు
ఒక్కదెబ్బ రెండుతుంట్లు – మెచ్చవాటినందరు
కురవనిమ్ము ఎగరనిమ్ము క్రూరమైన అమ్ములు
వరగనిమ్ము విరగనిమ్ము విరోధుల దుమ్ములు
చప్పున మగాళ్లు రావచ్చా నిప్పుల గుండాన దూకొచ్చా
ఏ తల్లిబిడ్డవో చెప్పవమా ఇంకోళ్లసొమ్ము దాచతప్ప మామా

చిన్న అడవి భామకూడా సిరతపులే కాచుకో
కన్నుకొట్టే ఏలకూడ కారుచిచ్చు తెలుసుకో
తలకొట్ట ఎవధి వుంది – దైవాన్నె తలుచుకో
తల్లితండ్రులకేదైనా సెప్పాలా సెప్పుకో ॥అందుకో॥

మామయ్య తేరగ దొరికాడు – మీ వలలోంచి యిక తప్పిపోలేడు
తెగబలసినమీ ఒళ్లు తెగిపోవును నేడు
సెగలో ఈ సాంబ్రాణి పొగజిమ్మను చూడు
సత్తెమున్న కాళీ నెత్తురులో తేలీ
సల్లగ మమ్మేలీ వరమిస్తుందోరీ
తల్లితోడు – తండ్రితోడు తలకొట్టాలి రారండి
అందరూ కలిసి అమ్మోర్ని కొలిచి – జాతర చేద్దాం కదలండి.
॥అందుకో॥

★ ★ ★